ఋకారాన్తః స్త్రీలిఙ్గ స్స్వసృశబ్దః. (తోఁడఁ బుట్టినది)

| | | |
|---|---|---|
| స్వసా | స్వసారౌ | స్వసారః |
| హే స్వసః | హే స్వసారౌ | హే స్వసారః |
| స్వసారమ్ | స్వసారౌ | స్వసౄః |

శేషం మాతృశబ్దవత్.

మిగిలినది మాతృశబ్దమువలెనే.

నేః పుంవత్. ద్యోర్గోవత్. రాః పుంవత్. నౌర్గ్లౌవత్

నేః-పుంలింగమువలెనే. ద్యోః-గోశబ్దమువలె.

రాః-పుంలింగమువలె. నౌః-గ్లౌశబ్దమువలె నుండును.

ఇత్యజన్త స్త్రీలిఙ్గ విశేషశబ్దాః.

అజంత స్త్రీలింగ విశేషశబ్దములు ముగిసెను

---

అజన్త నపుంసకలిఙ్గ విశేషశబ్దాః.

అజంత నపుంసకలింగ విశేషశబ్దములు.

అకారాన్త నపుంసకలిఙ్గః అజరశబ్దః. (ముసలితనము లేనిది)

| | | |
|---|---|---|
| అజరమ్ | అజరే / అజరసీ | అజరాణి / అజరాంసి |
| హే అజర | హే అజరే / హే అజరసీ | హే అజరాణి / హే అజరాంసి |

| | | |
|---|---|---|
| అజరమ్ / అజరసమ్ | అజరే / అజరసీ | అజరాణి / అజరాంసి |

శేషం నిర్జరశబ్దవత్.

మిగిలినది నిర్జరశబ్దమువలె.

హృదయశబ్దార్థకో హృచ్ఛబ్దో నిరూపిత ఏవ.

హృదయశబ్దముయొక్క అర్థము నిచ్చు
'హృత్' శబ్ద మీవరకే నిరూపింపబడినది.

ఉదకార్థక ఉదన్ శబ్దః, ఆస్యార్థక ఆసన్శబ్దశ్చ, నామన్శబ్దవత్.

ఉదకము-అను అర్థమున వచ్చు ఉదన్, ఆస్యార్థకమగు
ఆసన్-నామన్ శబ్దమువలె నుండును.

సకారాన్త నపుంసకలిఙ్గో మాంస్శబ్దః. (మాంసము)

| | | |
|---|---|---|
| మాంస్ | మాంసీ | మాంసి |
| తృ-మాంసా | మామ్భ్యామ్ | మామ్భిః |
| స-మాంసి | మాంసోః | మాంసు |

దీర్ఘాన్తా నపుంసకే హ్రస్వాన్తా భవన్తి.
విశ్వపమ్, విశ్వపే, విశ్వపాని, జ్ఞానవత్.
దీర్ఘాంతములు నపుంసకలింగములో హ్రస్వాన్తము లగును.
విశ్వపమ్-మున్నగునవి జ్ఞానశబ్దమువలెనే.

ఇకారాన్త నపుంసకలిఙ్గో దధిశబ్దః. (పెరుఁగు)

| | | |
|---|---|---|
| దధి | దధినీ | దధీని |
| హే దధే / హే దధి | హే దధినీ | హే దధీని |

| | | |
|---|---|---|
| దధి | దధినీ | దధీని |
| దధ్నా | దధిభ్యామ్ | దధిభిః |
| దధ్నే | దధిభ్యామ్ | దధిభ్యః |
| దధ్నః | దధిభ్యామ్ | దధిభ్యః |
| దధ్నః | దధ్నోః | దధ్నామ్ |
| దధ్ని / దధని | దధ్నోః | దధిషు |

ఏవమ్ అస్థి, సక్థి, అక్షి.

అస్థి, సక్థి, అక్షి - శబ్దములు నిట్లే.

ఇకారాన్త నపుంసకలిఙ్గ త్రిశబ్దో

నిత్యబహువచనాన్తః (మూఁడు)

త్రీణి, త్రీణి, శేషం పుంవత్.

మిగిలినది పుంలింగమువలెనే.

ప్రధిశబ్దో భాషితపుంస్కః, అతస్తస్య తృతీయా

మారభ్య పుంవత్ క్లీబవచ్చ రూపమ్.

ప్రధిశబ్దము భాషితపుంస్కము. అందువలన తృతీయావిభక్తి మొదలుకొని పుంలింగ రూపములు, నపుంసకలింగ రూపములుకూడ ఉండును.

| | | |
|---|---|---|
| ప్రధ్యా / ప్రధినా | ప్రధిభ్యామ్ | ప్రధిభిః |
| ప్రధ్యే / ప్రధినే | ప్రధిభ్యామ్ | ప్రధిభ్యః |

| | | |
|---|---|---|
| ప్రధ్యః / ప్రధినః | ప్రధిభ్యామ్ | ప్రధిభ్యః |
| ప్రధ్యః / ప్రధినః | ప్రధ్యోః / ప్రధినోః | ప్రధ్యామ్ / ప్రధినామ్ |
| ప్రధ్యి / ప్రధిని | ప్రధ్యోః / ప్రధినోః | ప్రధిషు |

సుధిశబ్దశ్చ తథా.

సుధిశబ్దముకూడ ఈరీతినే యుండును.

| | | |
|---|---|---|
| సుధియా / సుధినా | సుధిభ్యామ్ | సుధిభిః |
| సుధియే / సుధినే | సుధిభ్యామ్ | సుధిభ్యః |
| సుధియః / సుధినః | సుధిభ్యామ్ | సుధిభ్యః |
| సుధియః / సుధినః | సుధియోః / సుధినోః | సుధియామ్ / సుధినామ్ |
| సుధియి / సుధిని | సుధియోః / సుధినోః | సుధిషు |

చిత్రగు, ప్రద్యు, సును ఇత్యాదయో మధుశబ్దవత్.

చిత్రగు, ప్రద్యు, సును మున్నగు శబ్దములు మధుశబ్దమువలెనే ఉండును.

ఇకారాన్త నపుంసకలిఙ్గః ప్రరిశబ్దః. (విశేషణము)

| | | |
|---|---|---|
| ప్రరి | ప్రరిణీ | ప్రరీణి |

| | | |
|---|---|---|
| తృ-ప్రరిణా | ప్రరాభ్యామ్ | ప్రరాభిః |
| ష-ప్రరిణః | ప్రరిణోః | ప్రరీణామ్ |
| స-ప్రరిణి | ప్రరిణోః | ప్రరాసు |

ఇత్యజన్త నపుంసకలిఙ్గ విశేషశబ్దాః.

అజంత నపుంసకలింగ విశేష శబ్దములు ముగిసెను.

---

## అథ హలన్త పుంలిఙ్గ విశేషశబ్దాః.

హలంత పుంలింగ విశేష శబ్దములు.

చకారాన్తః పుంలిఙ్గః ప్రాక్ఛబ్దః. (తొల్లింటివాఁడు)

| | | |
|---|---|---|
| ప్రాఙ్ | ప్రాఞ్చౌ | ప్రాఞ్చః |
| ప్రాఞ్చమ్ | ప్రాఞ్చౌ | ప్రాచః |
| ప్రాచా | ప్రాగ్భ్యామ్ | ప్రాగ్భిః |

ఇత్యాది జలముక్ఛబ్దవత్.

ఇట్లు జలముక్ఛబ్దమువలెనే యుండును.

ఏవం పరాఙ్, అపాఙ్, అవాఙ్ ఇత్యాదయః.

పరాఙ్ మున్నగునవియు నిట్లే.

చకారాన్తః పుంలిఙ్గః ప్రత్యక్ఛబ్దః. (పరబ్రహ్మము)

| | | |
|---|---|---|
| ప్రత్యఙ్ | ప్రత్యఞ్చౌ | ప్రత్యఞ్చః |
| ప్రత్యఞ్చమ్ | ప్రత్యఞ్చౌ | ప్రతీచః |
| ప్రతీచా | ప్రత్యగ్భ్యామ్ | ప్రత్యగ్భిః |
| ప్రతీచే | ప్రత్యగ్భ్యామ్ | ప్రత్యగ్భ్యః |

| | | |
|---|---|---|
| ప్రతీచః | ప్రత్యగ్భ్యామ్ | ప్రత్యగ్భ్యః |
| ప్రతీచః | ప్రతీచోః | ప్రతీచామ్ |
| ప్రతీచి | ప్రతీచోః | ప్రత్యక్షు |

ఏవం సమ్యఙ్, న్యఙ్, సధ్ర్యఙ్, విష్వద్ర్యఙ్, దేవద్ర్యఙ్, సర్వద్ర్యఙ్, అదద్ర్యఙ్ ఇత్యాదయః.

సమ్యఙ్ మున్నగునవియు నిట్లే యుండును.

చకారాన్తః పుంలిఙ్గోఽన్వఞ్ఛబ్దః. (అనుసరించువాఁడు)

| | | |
|---|---|---|
| అన్వఙ్ | అన్వఞ్చౌ | అన్వఞ్చః |
| అన్వఞ్చమ్ | అన్వఞ్చౌ | అనూచః |
| అనూచా | అన్వగ్భ్యామ్ | అన్వగ్భిః |
| ష-అనూచః | అనూచోః | అనూచామ్ |
| స-అనూచి | అనూచోః | అన్వక్షు |

చకారాన్తః పుంలిఙ్గ ఉదఞ్ఛబ్దః. (ఉత్తరపు దిక్కువాఁడు)

| | | |
|---|---|---|
| ఉదఙ్ | ఉదఞ్చౌ | ఉదఞ్చః |
| ఉదఞ్చమ్ | ఉదఞ్చౌ | ఉదీచః |
| ఉదీచా | ఉదగ్భ్యామ్ | ఉదగ్భిః |
| ష-ఉదీచః | ఉదీచోః | ఉదీచామ్ |
| స-ఉదీచి | ఉదీచోః | ఉదక్షు |

చకారాన్తః పుంలిఙ్గస్తిర్యఞ్ఛబ్దః. (పశుపక్ష్యాది జంతువు)

| | | |
|---|---|---|
| తిర్యఙ్ | తిర్యఞ్చౌ | తిర్యఞ్చః |
| తిర్యఞ్చమ్ | తిర్యఞ్చౌ | తిరశ్చః |

| | | |
|---|---|---|
| తిరశ్చా | తిర్యగ్భ్యామ్ | తిర్యగ్భిః |
| ష-తిరశ్చః | తిరశ్చోః | తిరశ్చామ్ |
| స-తిరశ్చి | తిరశ్చోః | తిర్యక్షు |

పూజార్థకాఞ్చుధాత్వన్తత్వే

పూజార్థక మైన అఞ్చు ధాత్వంత మై యున్నప్పుడు.

| | | |
|---|---|---|
| ద్వి-ప్రాఞ్చమ్ | ప్రాఞ్చా | ప్రాఞ్చః |
| తృ-ప్రాఞ్చా | ప్రాఙ్భ్యామ్ | ప్రాఙ్భిః |
| ప-ప్రాఞ్చః | ప్రాఞ్చోః | ప్రాఞ్చామ్ |
| స-ప్రాఞ్చి | ప్రాఞ్చోః | ప్రాఙ్క్షు |

ఇత్యాద్యూహ్యమ్.

ఈ మొదలగునవి ఊహ్యములు.

చకారాన్తః పుంలిఙ్గ స్సువృట్ఛబ్దః. (ఛేదకుఁడు)

| | | |
|---|---|---|
| సువృట్ | సువృశ్చౌ | సువృశ్చః |
| సువృశ్చమ్ | సువృశ్చౌ | సువృశ్చః |
| సువృశ్చా | సువృడ్భ్యామ్ | సువృడ్భిః |
| స-సువృశ్చి | సువృశ్చోః | సువృట్సు |

ఛకారాన్తః పుంలిఙ్గః ప్రాట్ఛబ్దః. (అడుగునట్టివాఁడు)

| | | |
|---|---|---|
| ప్రాట్ | ప్రాచ్ఛౌ | ప్రాచ్ఛః |
| ప్రాచ్ఛమ్ | ప్రాచ్ఛౌ | ప్రాచ్ఛః |
| ప్రాచ్ఛా | ప్రాడ్భ్యామ్ | ప్రాడ్భిః |
| స-ప్రాచ్ఛి | ప్రాచ్ఛోః | ప్రాట్సు |

జకారాన్తః పుంలిఙ్గో రాట్ఛబ్దః (రాజు)

| | | |
|---|---|---|
| రాట్ | రాజౌ | రాజః |
| రాజమ్ | రాజౌ | రాజః |
| రాజా | రాడ్భ్యామ్ | రాడ్భిః |
| ష-రాజః | రాజోః | రాజామ్ |
| స-రాజి | రాజోః | రాట్సు |

ఏవం విశ్వసృట్, పరివృట్, దేవేట్,

సృజ మృజ యజ ధాతునిష్పన్నాః, పరివ్రాట్చ.

సృజ, మృజ, యజ ధాతువులందుండి యేర్పడిన విశ్వసృట్, పరివృట్, దేవేట్ శబ్దములును, పరివ్రాట్ శబ్దమును ఇట్లే యుండును.

జకారాన్తః పుంలిఙ్గో భృట్ఛబ్దః. (వంటవాఁడు)

| | | |
|---|---|---|
| భృట్ | భృజ్జౌ | భృజ్జః |
| భృజ్జమ్ | భృజ్జౌ | భృజ్జః |
| భృజ్జా | భృడ్భ్యామ్ | భృడ్భిః |
| స-భృజ్జి | భృజ్జోః | భృట్సు |

జకారాన్తః పుంలిఙ్గో విభ్రాట్ఛబ్దః. (ప్రకాశించువాఁడు)

| | | |
|---|---|---|
| విభ్రాక్ / విభ్రాట్ | విభ్రాజౌ | విభ్రాజః |
| తృ-విభ్రాజా | విభ్రాగ్భ్యామ్ / విభ్రాడ్భ్యామ్ | విభ్రాగ్భిః / విభ్రాడ్భిః |

| | | |
|---|---|---|
| ష-విభ్రాజః | విభ్రాజోః | విభ్రాజామ్ |
| స-విభ్రాజి | విభ్రాజోః | { విభ్రాడు<br>విభ్రాట్సు |

జకారాన్తః పుంలిఙ్గో యుక్ఛబ్దః. (కూడునట్టివాఁడు)

| | | |
|---|---|---|
| యుఙ్ | యుఞ్జౌ | యుఞ్జః |
| యుఞ్జమ్ | యుఞ్జౌ | యుజః |

శేషం భిషక్ఛబ్దవత్.

మిగిలినది భిషక్ శబ్దమువలెనే.

సమాధాత్రర్థకో యుక్ఛబ్దో భిషక్ఛబ్దవత్.

సమాధాత అను నర్థమున వచ్చు యుక్ అను

శబ్దము భిషక్ఛబ్దమువలెనే ఉండును.

ణకారాన్తః పుంలిఙ్గ స్సుగణ్ శబ్దః. (మంచిగణకుఁడు)

| | | |
|---|---|---|
| సుగణ్ | సుగణౌ | సుగణః |
| తృ-సుగణా | సుగణ్భ్యామ్ | సుగణ్భిః |
| స-సుగణి | సుగణోః | సుగణ్సు |

థకారాన్తః పుంలిఙ్గోఽగ్నిమచ్ఛబ్దః. (అగ్నిమథించువాఁడు)

| | | |
|---|---|---|
| అగ్నిమత్ | అగ్నిమథౌ | అగ్నిమథః |
| తృ-అగ్నిమథా | అగ్నిమద్భ్యామ్ | అగ్నిమద్భిః |
| స-అగ్నిమథి | అగ్నిమథోః | అగ్నిమత్సు |

ధకారాన్తః పుంలిఙ్గో భుచ్ఛబ్దః. (తెలిసినవాఁడు)

| | | |
|---|---|---|
| భుత్ | బుధౌ | బుధః |
| తృ-బుధా | భుద్భ్యామ్ | భుద్భిః |

| | | |
|---|---|---|
| బుధే | భుద్భ్యామ్ | భుద్భ్యః |
| బుధః | భుద్భ్యామ్ | భుద్భ్యః |
| బుధః | బుధోః | బుధామ్ |
| బుధి | బుధోః | భుత్సు |

ఏవం మర్మవిత్ ఇత్యాదయః.

మర్మవిత్ మున్నగునవియు నిట్లే.

నకారాన్తః పుంలిఙ్గః పూషన్‌శబ్దః. (సూర్యుఁడు)

| | | |
|---|---|---|
| పూషా | పూషణౌ | పూషణః |
| హే పూషన్ | హే పూషణౌ | హే పూషణః |
| పూషణమ్ | పూషణౌ | పూష్ణః |
| పూష్ణా | పూషభ్యామ్ | పూషభిః |
| స-పూష్ణి / పూషణి | పూష్ణోః | పూషసు |

ఏవమర్యమా.

అర్యమా శబ్దముకూడ నిట్లే.

నకారాన్తః పుంలిఙ్గో వృత్రహన్‌శబ్దః. (ఇంద్రుఁడు)

| | | |
|---|---|---|
| వృత్రహా | వృత్రహణౌ | వృత్రహణః |
| హే వృత్రహన్ | హే వృత్రహణౌ | హే వృత్రహణః |
| వృత్రహణమ్ | వృత్రహణౌ | వృత్రఘ్నః |
| వృత్రఘ్నా | వృత్రహాభ్యామ్ | వృత్రహాభిః |

| | | |
|---|---|---|
| స-వృత్రఘ్ని / వృత్రహాణి | వృత్రఘ్నోః | వృత్రహాసు |

ఏవం బ్రహ్మహా, భ్రూణహా ఇత్యాదయో హానన్తాః

బ్రహ్మహా, భ్రూణహా మున్నగు హానంతములగు శబ్దములన్నియు నిట్లే యుండును.

నకారాన్తః పుంలిఙ్గ శ్వన్‌శబ్దః. (కుక్క)

| | | |
|---|---|---|
| శ్వా | శ్వానౌ | శ్వానః |
| హే శ్వన్ | హే శ్వానౌ | హే శ్వానః |
| శ్వానమ్ | శ్వానౌ | శునః |
| శునా | శ్వభ్యామ్ | శ్వభిః |
| శునే | శ్వభ్యామ్ | శ్వభ్యః |
| శునః | శ్వభ్యామ్ | శ్వభ్యః |
| శునః | శునోః | శునామ్ |
| శుని | శునోః | శ్వసు |

నకారాన్తః పుంలిఙ్గో యువన్‌శబ్దః. (తరుణుఁడు)

| | | |
|---|---|---|
| యువా | యువానౌ | యువానః |
| హే యువన్ | హే యువానౌ | హే యువానః |
| యువానమ్ | యువానౌ | యూనః |
| యూనా | యువభ్యామ్ | యువభిః |
| యూనే | యువభ్యామ్ | యువభ్యః |
| యూనః | యువభ్యామ్ | యువభ్యః |
| యూనః | యూనోః | యూనామ్ |
| యూని | యూనోః | యువసు |

నకారాన్తః పుంలిఙ్గో మఘవచ్ఛబ్దః. (ఇంద్రుడు)

| | | |
|---|---|---|
| మఘవా | మఘవానౌ | మఘవానః |
| హే మఘవన్ | హే మఘవానౌ | హే మఘవానః |
| మఘవానమ్ | మఘవానౌ | మఘోనః |
| మఘోనా | మఘవభ్యామ్ | మఘవభిః |
| మఘోనే | మఘవభ్యామ్ | మఘవభ్యః |
| మఘోనః | మఘవభ్యామ్ | మఘవభ్యః |
| మఘోనః | మఘోనోః | మఘోనామ్ |
| మఘోని | మఘోనోః | మఘవసు |

అయం ధీమద్వదపి.

ఈ శబ్దము ధీమచ్ఛబ్దమువలెకూడ నుండును.

| | | |
|---|---|---|
| మఘవాన్ | మఘవన్తౌ | మఘవన్తః |

ఇత్యాది.

నకారాన్తః పుంలిఙ్గోఽర్వన్ శబ్దః. (గుఱ్ఱము)

| | | |
|---|---|---|
| అర్వా | అర్వన్తౌ | అర్వన్తః |

శేషం ధీమచ్ఛబ్దవత్.

మిగిలినది ధీమచ్ఛబ్దమువలెనే.

నకారాన్తః పుంలిఙ్గః పథిన్శబ్దః. (మార్గము)

| | | |
|---|---|---|
| పన్థాః | పన్థానౌ | పన్థానః |
| పన్థానమ్ | పన్థానౌ | పథః |
| పథా | పథిభ్యామ్ | పథిభిః |

| | | |
|---|---|---|
| పథే | పథిభ్యామ్ | పథిభ్యః |
| పథః | పథిభ్యామ్ | పథిభ్యః |
| పథః | పథోః | పథామ్ |
| పథి | పథోః | పథిషు |

ఏవం మన్థాః. (కవ్వము)

మన్థాః - అనునదియు నిట్లే.

నకారాన్తః పుంలిఙ్గః ఋభుక్షన్ శబ్దః. (ఇంద్రుఁడు)

| | | |
|---|---|---|
| ఋభుక్షాః | ఋభుక్షాణౌ | ఋభుక్షాణః |
| ఋభుక్షాణమ్ | ఋభుక్షాణౌ | ఋభుక్షః |
| ఋభుక్షా | ఋభుక్షిభ్యామ్ | ఋభుక్షిభిః |
| స-ఋభుక్షి | ఋభుక్షోః | ఋభుక్షిషు |

నకారాన్తః పుంలిఙ్గః పఞ్చశబ్దో

నిత్యబహువచనాన్తః. (ఐదుగురు)

పఞ్చ, పఞ్చ, పఞ్చభిః, పఞ్చభ్యః, పఞ్చభ్యః,

పఞ్చానామ్, పఞ్చసు.

ఏవం సప్త, నవ, దశ.

సప్త-నవ-దశ శబ్దములుకూడ నిట్లే యుండును.

నకారాన్తః పుంలిఙ్గో౽ష్టన్శబ్దో

నిత్యబహువచనాన్తః. (ఎనమండ్రు)

ప్ర-అష్టౌ, అష్ట.
ద్వి-అష్టౌ, అష్ట.

తృ-అష్టాభిః, అష్టభిః.
చ-అష్టాభ్యః, అష్టభ్యః.
పం-అష్టాభ్యః, అష్టభ్యః.
ష-అష్టానామ్.
స-అష్టాసు, అష్టసు.

రేఫాన్తః పుంలిఙ్గ శ్చతుర్శబ్దో
నిత్యబహువచనాన్తః. (నలుగురు)

చత్వారః, చతురః, చతుర్భిః, చతుర్భ్యః, చతుర్భ్యః,
చతుర్ణామ్, చతుర్షు.

షకారాన్తః పుంలిఙ్గ ష్షట్ఛబ్దో
నిత్యబహువచనాన్తః. (ఆఱుగురు)

షట్, షట్, షడ్భిః, షడ్భ్యః, షడ్భ్యః, షణ్ణామ్, షట్సు.

సకారాన్తః పుంలిఙ్గో దోశ్శబ్దః. (బాహువు)

| | | |
|---|---|---|
| దోః | దోషౌ | దోషః |
| తృ-దోషా | దోర్భ్యామ్ | దోర్భిః |
| స-దోషి | దోషోః | దోష్షు |

ఏతదర్థకో దోషన్ శబ్దో రాజన్ శబ్దవత్.

ఈ శబ్దము నర్థమునందే వచ్చు దోషన్ శబ్దము
రాజన్ - శబ్దమువలె ఉండును.

సకారాన్తః పుంలిఙ్గః పుంస్ శబ్దః. (పురుషుఁడు)

| | | |
|---|---|---|
| పుమాన్ | పుమాంసౌ | పుమాంసః |
| హే పుమన్ | హే పుమాంసౌ | హే పుమాంసః |

| | | |
|---|---|---|
| పుమాంసమ్ | పుమాంసౌ | పుంసః |
| పుంసా | పుమ్భ్యామ్ | పుమ్భిః |
| ష-పుంసః | పుంసోః | పుంస్సు |

సకారాన్తః పుంలిఙ్గః ఉశనశ్శబ్దః. (శుక్రుఁడు)

| | | |
|---|---|---|
| ఉశనా | ఉశనసౌ | ఉశనసః |
| హే ఉశనన్, హే ఉశనః, హే ఉశన | హే ఉశనసౌ | హే ఉశనసః |

శేషం వేధశ్శబ్దవత్.

మిగిలినది వేధశ్శబ్దమువలెనే.

సకారాన్తః పుంలిఙ్గోఽనేహాశ్శబ్దః (కాలము)

| | | |
|---|---|---|
| అనేహా | అనేహాసౌ | అనేహాసః |

శేషం వేధశ్శబ్దవత్.

మిగిలినది వేధశ్శబ్దమువలెనే.

ఏవం పురుదంసా.

పురుదంసా శబ్దమును ఇట్లే.

హకారాన్తః పుంలిఙ్గో ధుక్ఛబ్దః. (పిదికెడువాఁడు)

| | | |
|---|---|---|
| ధుక్ | దుహౌ | దుహః |
| తృ-దుహా | ధుగ్భ్యామ్ | ధుగ్భిః |
| స-దుహి | దుహోః | ధుక్షు |

హకారాన్తః పుంలిఙ్గో విశ్వవాట్ఛబ్దః. (జగద్భర్త)

| | | |
|---|---|---|
| విశ్వవాట్ | విశ్వవాహౌ | విశ్వవాహః |
| విశ్వవాహమ్ | విశ్వవాహౌ | విశ్వౌహః |
| విశ్వౌహా | విశ్వవాడ్భ్యామ్ | విశ్వవాడ్భిః |
| ష-విశ్వౌహః | విశ్వౌహోః | విశ్వౌహామ్ |
| విశ్వౌహి | విశ్వౌహోః | విశ్వవాట్సు |

ఏవం షష్ఠవాట్, రాజవాట్ ఇత్యాదయః

షష్ఠవాట్, రాజవాట్ మున్నగునవియు నిట్లే.

హకారాన్తః పుంలిఙ్గస్తురాషాట్ఛబ్దః (ఇంద్రుఁడు)

| | | |
|---|---|---|
| తురాషాట్ | తురాసాహౌ | తురాసాహః |
| తురాసాహమ్ | తురాసాహౌ | తురాసాహః |
| తురాసాహా | తురాషాడ్భ్యామ్ | తురాషాడ్భిః |
| ష-తురాసాహః | తురాసాహోః | తురాసాహామ్ |
| తురాసాహి | తురాసాహోః | తురాషాట్సు |

హకారాన్తః పుంలిఙ్గోఽనడుచ్ఛబ్దః. (ఎద్దు)

| | | |
|---|---|---|
| అనడ్వాన్ | అనడ్వాహౌ | అనడ్వాహః |
| హే అనడ్వన్ | హే అనడ్వాహౌ | హే అనడ్వాహః |
| అనడుహా | అనడుద్భ్యామ్ | అనడుద్భిః |
| ష-అనడుహః | అనడుహోః | అనడుహామ్ |
| అనడుహి | అనడుహోః | అనడుత్సు |

ఇతి హలన్త పుంలిఙ్గ విశేషశబ్దాః.

హలంత పుంలింగ విశేషశబ్దములు ముగిసెను.

## హలన్త స్త్రీలిఙ్గ విశేషశబ్దాః.

## హలంత స్త్రీలింగ విశేషశబ్దములు.

ప్రాచీ-ప్రతీచీ-ఉదీచీ-అనూచీ-విష్వద్రీచీ-దేవద్రీచీ-సధ్ర్యద్రీచీ - తిరశ్చీ - ఇత్యాకారేణా ఇఞ్చుధాత్వన్తాః గౌరీశబ్దవద్రూపం లభన్తే.

పఞ్చ-సప్త-నవ-దశ-అష్టౌ-షట్ - ఏతే లిఙ్గత్రయేఽపి సరూపాః.

ప్రాచీ, ప్రతీచీ, ఉదీచీ, అనూచీ, విష్వద్రీచీ, దేవద్రీచీ, సర్వద్రీచీ, తిరశ్చీ మొదలైన అఞ్చుధాత్వన్త శబ్దములకు గౌరీశబ్దమువలెనే రూపములు ఉండును.

పఞ్చ, సప్త, నవ, దశ, అష్టౌ, షట్ — అను శబ్దములు మూడు లింగములందును భేదములేక ఒక్క విధముగానే ఉండును.

### పకారాన్తః స్త్రీలిఙ్గోఽప్శబ్దో నిత్య బహువచనాన్తః. (నీళ్లు)

ఆపః-అపః-అద్భిః-అద్భ్యః-అపామ్-అప్సు.

### రేఫాన్తః స్త్రీలిఙ్గ శ్చతుర్శబ్దో నిత్యబహువచనాన్తః.

చతస్రః-చతస్రః-చతసృభిః-చతసృభ్యః-
చతసృభ్యః-చతసృణామ్-చతసృషు.

### షకారాన్తః స్త్రీలిఙ్గ స్సజూశ్శబ్దః. (కూడి పొందినది)

| | | |
|---|---|---|
| సజూః | సజుషౌ | సజుషః |
| తృ-సజుషా | సజూర్భ్యామ్ | సజూర్భిః |
| స-సజుషి | సజుషోః | సజూష్షు |

సకారాన్తః స్త్రీలిఙ్గః ఆశీశ్శబ్దః. (దీవన)

| | | |
|---|---|---|
| ఆశీః | ఆశిషౌ | ఆశిషః |
| తృ-ఆశిషా | ఆశీర్భ్యామ్ | ఆశీర్భిః |
| స-ఆశిషి | ఆశిషోః | ఆశీష్షు |

హకారాన్తః స్త్రీలిఙ్గః ఉపానచ్ఛబ్దః. (పాదుక)

| | | |
|---|---|---|
| ఉపానత్ | ఉపానహౌ | ఉపానహః |
| తృ-ఉపానహా | ఉపానద్భ్యామ్ | ఉపానద్భిః |
| స-ఉపానహి | ఉపానహోః | ఉపానత్సు |

ఉష్ణిక్ఛబ్దో ధుక్ఛబ్దవత్.

ఉష్ణిక్ శబ్దము ధుక్ఛబ్దమువలె ఉండును.

ఇతి హలన్త స్త్రీలిఙ్గ విశేషశబ్దాః.

హలంత స్త్రీలింగ విశేష శబ్దములు ముగిసెను.

---

హలన్త నపుంసకలిఙ్గ విశేషశబ్దాః.

(హలంత నపుంసకలింగ విశేష శబ్దములు.)

ప్రాక్ఛబ్దః సువాక్ఛబ్దవత్. ఏవం పరాగాదయః.

ప్రాక్ శబ్దము సువాక్ శబ్దమువలె ఉండును.

'పరాక్' మున్నగునవియు నిట్లే.

చకారా_న్త నపుంసకలిఙ్గః ప్రత్యక్ఛబ్దః.(వెనుకనది)

| | | |
|---|---|---|
| ప్రత్యక్ | ప్రతీచీ | ప్రత్యఞ్చి |

పున_స్తద్వత్; శేషం పుంవత్.

ద్వితీయా విభక్తియు నిట్లే; మిగిలినది పుంలింగమువలెనే.

ఏవం సమ్యగాదయః.

సమ్యక్ మున్నగునవియు నిట్లే.

చకారా_న్త నపుంసకలిఙ్గోఽన్వక్ఛబ్దః. (అనుసరించునది)

| | | |
|---|---|---|
| అన్వక్ | అనూచీ | అన్వఞ్చి |

పున_స్తద్వత్. శేషం పుంవత్.

ద్వితీయా విభక్తియు నిట్లే. మిగిలినది పుంలింగమువలె.

చకారా_న్త నపుంసకలిఙ్గః ఉదక్ఛబ్దః. (ఉత్తరమున నున్నది)

| | | |
|---|---|---|
| ఉదక్ | ఉదీచీ | ఉదఞ్చి |

పున_స్తద్వత్; శేషం పుంవత్;

ద్వితీయా విభక్తియు నిట్లే. మిగిలినది పుంలింగమువలెనే.

చకారా_న్త నపుంసకలిఙ్గోఽహన్ శబ్దః. (దినము)

| | | |
|---|---|---|
| అహః | { అహ్నీ / అహనీ } | అహాని |
| తృ-అహ్నా | అహోభ్యామ్ | అహోభిః |
| స-అహ్ని / అహని } | అహ్నోః | అహస్సు |

రేఫా_న్త నపుంసకలిఙ్గో వార్శ్శబ్దః. (నీరు)

| | | |
|---|---|---|
| వాః | వారీ | వారి |
| తృ-వారా | వార్భ్యామ్ | వార్భిః |
| స-వారి | వారోః | వార్షు |

రేఫా_న్త నపుంసకలిఙ్గ శ్చతుర్శబ్దో

నిత్యబహువచనా_న్తః. (నాలుగు)

చత్వారి-చత్వారి-శేషం పుంవత్.

మిగిలినది పుంలింగము వలెనే.

సకారా_న్త నపుంసకలిఙ్గో ధనుశ్శబ్దః (విల్లు)

| | | |
|---|---|---|
| ధనుః | ధనుషీ | ధనూంషి |
| తృ-ధనుషా | ధనుర్భ్యామ్ | ధనుర్భిః |
| స-ధనుషి | ధనుషోః | ధనుఃష్షు |

సకారా_న్త నపుంసకలిఙ్గో శోచిశ్శబ్దః. (కాంతి)

| | | |
|---|---|---|
| శోచిః | శోచిషీ | శోచీంషి |
| తృ-శోచిషా | శోచిర్భ్యామ్ | శోచిర్భిః |
| స-శోచిషి | శోచిషోః | శోచిష్షు |

ఏవం రోచిః ఇత్యాదయః.

రోచిః - మున్నగునవియు నిట్లే.

ఇతి హల_న్త నపుంసకలిఙ్గ విశేషశబ్దాః.

హలంత నపుంసకలింగ విశేషశబ్దములు ముగిసెను.

---

ఇకారాన్తః పుంలిఙ్గః ఔడులోమిశబ్దః

(ఉడులోముని కుమారుఁడు)

| ఏ. | ద్వి. | బ. |
|---|---|---|
| ఔడులోమిః | ఔడులోమీ | ఉడులోమాః |
| హే ఔడులోమే | హే ఔడులోమీ | హే ఉడులోమాః |
| ఔడులోమిమ్ | ఔడులోమీ | ఉడులోమాన్ |
| ఔడులోమినా | ఔడులోమిభ్యామ్ | ఉడులోమైః |
| ఔడులోమయే | ఔడులోమిభ్యామ్ | ఉడులోమేభ్యః |
| ఔడులోమేః | ఔడులోమిభ్యామ్ | ఉడులోమేభ్యః |
| ఔడులోమేః | ఔడులోమ్యోః | ఉడులోమానామ్ |
| ఔడులోమౌ | ఔడులోమ్యోః | ఉడులోమేషు |

ఏవమ్ ఆత్రేయః-ఆత్రేయౌ-అత్రయః, ఐక్ష్వాకః-ఐక్ష్వాకౌ-ఇక్ష్వాకవః ఇత్యాదయ శ్శాస్త్రవశేనావగన్తవ్యాః.

(ఆత్రేయః, ఐక్ష్వాకః-మున్నగు శబ్దములును శాస్త్రవశమున ఇట్లే యగునని తెలిసికొనవలెను.)

చకారాన్త నపుంసకలిఙ్గో గవాక్ఛబ్దః.

శ్లో. గవాక్ఛబ్దస్య రూపాణి క్లీబేఽర్చాగతిభేదతః,
అసన్ధ్యవఙ్ పూర్వరూపై ర్నవాధికశతం మతమ్.

గవాక్ శబ్దమునకు నపుంసక లింగమున గతి, అర్చ అను నర్థ భేదముల వలన అసంధి, అవఙ్ పూర్వములైన రూపములు మొత్తము 190 ఏర్పడును.

ప్ర. గవాక్ గవాగ్ }
గోఅక్ గోఅగ్ }

| | | |
|---|---|---|
| గోక్<br>గోగ్<br>ఇతి గతావషట్<br>(గత్యర్థమున ఆరు రూపములు)<br>గవాఙ్<br>గోఅఙ్<br>గోఙ్<br>ఇతి పూజాయాం త్రీణి.<br>(పూజార్థమున మూడురూపములు) | గోచీ<br><br>గవాఞ్చి<br>గోఅఞ్చి<br><br>గోఞ్చీ<br>ఏవం ద్వితీయావిభక్తావపి<br>(ద్వితీయావిభక్తియందును నిట్లే.) | <br><br>గవాఞ్చి<br>గోఅఞ్చి<br>గోఞ్చి |

| | | |
|---|---|---|
| తృ. గోచా<br>గవాఞ్చా<br>గోఅఞ్చా<br>గోఞ్చా | గవాగ్భ్యామ్<br>గోఅగ్భ్యామ్<br>గోగ్భ్యామ్<br>గవాఙ్భ్యామ్<br>గోఅఙ్భ్యామ్<br>గోఙ్భ్యామ్ | గవాగ్భిః<br>గోఅగ్భిః<br>గోగ్భిః<br>గవాఙ్భిః<br>గోఅఙ్భిః<br>గోఙ్భిః |

| | | |
|---|---|---|
| చ. గోచే<br>గవాఞ్చే<br>గోఅఞ్చే<br>గోఞ్చే | భ్యామి ప్రాగ్వత్<br>(భ్యామ్ వచ్చునప్పుడు మీది రీతినే.) | గవాగ్భ్యః<br>గోఅగ్భ్యః<br>గోగ్భ్యః<br>గవాఙ్భ్యః<br>గోఅఙ్భ్యః<br>గోఙ్భ్యః |

ప. గోచః / గవాఞ్చః / గోఅఞ్చః / గోఞ్చః — భ్యామి ప్రాగ్వత్ (భ్యామ్ వచ్చునప్పుడు మీది రీతినే) — భ్యసి ప్రాగ్వత్ (భ్యస్ వచ్చునప్పుడు వెనుకటివలెనే)

ష. ఙసి ఙసివత్ (ఙస్‌లో ఙసివలెనే) — గోచోః / గవాఞ్చోః / గోఅఞ్చోః / గోఞ్చోః — గోచామ్ / గవాఞ్చామ్ / గోఅఞ్చామ్ / గోఞ్చామ్

స. గోచి / గవాఞ్చి / గోఅఞ్చి / గోఞ్చి — ఓసి ప్రాగ్వత్ (ఓస్‌లో వెనుకటివలెనే) — గవాక్షు / గోఅక్షు / గోక్షు / గవాఙ్షు / గోఅఙ్షు / గోఙ్షు / గవాఙ్‌క్షు / గోఅఙ్‌క్షు / గోఙ్‌క్షు

శ్లో. సమ్సుప్సు నవ (౯) షడ్ (౬) భాద్‌షట్కే-సుప్స్యత్రీణి (౩) జశ్శసోః, చత్వారి శేషే దశకే రూపాణీతి విభావయ.

[ఈ శబ్దమునకు సు-అమ్-సుప్‌లలో తొమ్మిదేసియు, భ్యామ్, భిస్, భ్యస్‌లలో ఆరేసియు, జస్, శస్‌లలో మూడేసియును, మిగిలిన పది విభక్తులలోను నాల్గేసిరూపములును ఏర్పడును.]

# అవ్యయాని

(అవ్యయములు)

లింగ విభక్తి వచన శూన్యాన్యవ్యయాని. తాని ద్వేధా-ప్రతిపదోక్తాని, లాక్షణికాని చేతి. తత్ర సూత్రకృతా స్వరాది చాది ప్రాద్యూర్యాది సాక్షాత్ప్రభృత్యాది రూపేణ స్వతో నిపాతితాని ప్రతిపదోక్తాని. తా న్యమరకోశావ్యయ వర్గే ద్రష్టవ్యాని.

లింగము, విభక్తి, వచనము లేనివి అవ్యయములు. అవి రెండు విధములు-ప్రతిపదోక్తములు, లాక్షణికములు అని. అందు సూత్రకర్తయైన పాణినిమహర్షి స్వయముగా ప్రతిపదము ఉచ్చరించి నిపతించిన స్వరాదులు, చాదులు, ప్రాదులు, ఊర్యాదులు, సాక్షాత్ప్రభృతులు ప్రతిపదోక్తములు. అవి అమరకోశమందలి అవ్యయవర్గమున కనబడును.

తత్ర కానిచి ద్విభక్తి ప్రతిరూపకాణి. యథా-

వామ్ - యువామర్థే. 'గేయేకేన వినీతౌ వామ్'.

అస్తి - సత్తాయామ్. అస్తిమాన్=ధనికః; ఆస్తికః=పరలోకోఽస్తీతి జ్ఞానవాన్; అస్య లిఙ్గాన్తత్వేఽప్రాతిపదికత్వాత్తద్ధితా నాపత్తిః.

అస్మి - అహమర్థే. అస్మివచ్మి=అహం వచ్మీత్యర్థః.

ఆహ - ఉవాచేత్యర్థే.

ఆస - బభూవేత్యర్థే.

ఏవం చిరాదిత్యాదీనా మప్యర్థ బాధాద్యాపత్త్యా అవ్యయత్వ మవశ్యాంగీకరణీయమ్.

ప్రతిపదోక్తావ్యయములలో కొన్ని విభక్త్యంత సదృశము లుగా నుండును. ఉదా :

వామ్-యువామ్ (మీరిద్దరు) అను నర్థమున అవ్యయము. "గేయమున మీరిద్దరు (వామ్) ఎవ్వనిచేత శిక్షితులు ?"

అస్తి - ఉండుట అను నర్థమున. అస్తిమాన్=ధనవంతుడు; ఆస్తికః= పరలోకము ఉన్నది అను జ్ఞానముకలవాడు; దీనికి లింగాంతత్వమున్నను ప్రాతిపదికత్వము లేనందువలన తద్ధితాపత్తి లేదు.

అస్మి - నేను అను నర్థమున. అస్మి వచ్మి=నేను చెప్పుచున్నాను అని యర్థము.

ఆహ - చెప్పెను అను నర్థమున.

ఆస - ఉండెను అను నర్థమున.

ఇట్లు 'చిరాత్' మున్నగు వానికి గూడ అర్థ బాధాదులు కలుగుటవల్ల అవ్యయత్వము తప్పక అంగీకరింపవలసియున్నది. 'చిరాత్' అనగా చాలకాలమునుండి అని యర్థముకాదు. చాలకాలము అని మాత్రమే అర్థము. చిరాయ, చిరేణ అన్నను చిరకాలము అనియే అర్థము.

శాస్త్రసిద్ధా న్యవ్యయాని లాక్షణికాని. తాని త్రేధా- అవ్యయీభావ, కృదన్త, తద్ధితాన్త భేదాత్.

వ్యాకరణ శాస్త్రమువలన నేర్పడిన అవ్యయములు లాక్షణికములు. అవి మూడువిధములు- అవ్యయీభావములు, కృదంతములు, తద్ధితాంతములు- అని.

అవ్యయీభావాః యథా :

ఉపకుమ్భమ్ - అపదిశమ్ - మధ్యేసముద్రమ్ - శాకప్రతి - ప్రతి పురుషమ్-ఆబాలమ్-ఇత్యాదయః. ఇమే సప్రపఞ్చం సమాస నిరూపణగ్రన్థే నిరూపయిష్యన్తే.

అవ్యయీభావములు ఎట్లన :

ఉపకుమ్భమ్=కుంభము సమీపమున; అపదిశమ్=దిక్కులనడుమ; మధ్యే సముద్రమ్=సముద్రమధ్యమున; శాకప్రతి=శాకమునుగూర్చి; ప్రతిపురుషమ్=ఒక్కొక్క పురుషునిబట్టి; ఆబాలమ్=బాలురుమొదలు; మున్నగునవి. ఇవి సవిస్తరముగా సమాస నిరూపణ సందర్భమున వివరింపబడగలవు.

అవ్యయత్వాపాదక కృత్ప్రత్యయా యథా :

తుమున్-క్త్వా-ల్యప్-ణముల్. ఏతదన్తాన్యవ్యయాని.

అవ్యయత్వము కలిగించు కృత్ప్రత్యయములు ఎట్లన: తుమున్-క్త్వా-ల్యప్-ణముల్. ఇవి యంతమునగలవి అవ్యయములు.

తుమున్ ప్రత్యయాన్తా యథా :

తుమున్ ప్రత్యయాంతములు : భవితుమ్=అగుటకు; యాతుమ్=పోవుటకు; గన్తుమ్=వెళ్లుటకు; కర్తుమ్=చేయుటకు; భోక్తుమ్ = భుజించుటకు- ఇత్యాదులు.

క్త్వాప్రత్యయాన్తా యథా :

క్త్వా ప్రత్యయాంతములు : కృత్వా=చేసి; దృష్ట్వా=చూచి; భఙ్క్త్వా=భంజించి; బుద్ధ్వా=తెలిసి; బద్ధ్వా= బంధించి; త్యక్త్వా = విడిచి- ఇత్యాదులు.

## ల్యప్ ప్రత్యయాన్తా యథా :

ల్యప్ ప్రత్యయాంతములు : సన్తర్ప్య=తృప్తిపొందించి; అధిగత్య=పొంది; విహాస్య=విడిచి; విహాయ = విడిచి; విధాయ = చేసి; ప్రముచ్య = వదలి- ఇత్యాదులు.

## ణముల్ ప్రత్యయాన్తా యథా :

ణముల్ ప్రత్యయాంతములు : స్మారంస్మారమ్ = అతిశయముగా స్మరించి; పాయం పాయమ్=విడిచి విడిచి; చోరంకారమ్ = దొంగిలించి; ఇత్థం కారమ్=ఈ రీతిగా; కథం కారమ్=ఎట్లు; యావజ్జీవమ్=జీవించినంతకాలము; ఉదరం పూరమ్=కడుపు నిండునట్లు - ఇత్యాదులు.

## అవ్యయత్వాపాదక తద్ధితప్రత్యా యథా :

ఆమ్-వతిః-తసిల్-త్రల్-హ-అత్-దా-ర్హిల్-అధునా - దానీమ్-ద్యస్-ఉత్-అరిః-సమసణ్ - ఏద్యవి-ద్యః - ఏద్యుస్-ద్యుస్-థాల్-థముః-అస్తాతిః-అసిః-అతసుచ్-అస్తాతిలుక్-రిల్-రిష్టాతిల్-ఆతిః-ఏనస్-ఆచ్-ఆహి-ధా, ధ్యముఞ్ - ధముఞ్-ఏధాచ్-కృత్వసుచ్-సుచ్-సుజ్లుక్-శస్-తసిః - చ్విః - సాతిః - త్రా-డాచ్-ఏత దన్తాన్యవ్యయాని.

అవ్యయత్వము కలిగించు తద్ధితప్రత్యయములు : ఆమ్, వతిః, తసిల్, త్రల్ మున్నగు తద్ధిత ప్రత్యయములు అంతమునగల అవ్యయములు తద్ధితాంతావ్యయములు. ఉదాహరణములు—

ఆమ్ - నితరామ్ = ఎల్లప్పుడు; నితమామ్=ఎల్లప్పుడు; సుతరామ్=మిక్కిలి; సుతమామ్=మిక్కిలి; పచతితరామ్=బాగుగా వండుచున్నాడు; పచతితమామ్=బాగుగా వండుచున్నాడు.

వతిః - బ్రాహ్మణవత్=బ్రాహ్మణునివలె; మథురావత్ = మథురవలె; చైత్రవత్=చైత్రునివలె.

తసిల్ - సర్వతః=అంతటను; పూర్వతః=పూర్వము; కుతః=ఎందువలన.

త్రల్ - సర్వత్ర = అంతటను; కుత్ర = ఎక్కడ; యత్ర = ఎక్కడనైతే.

హ - ఇహ=ఇచ్చట; కుహ=ఎచ్చట.

అత్ - క్వ=ఎక్కడ.

డా - సర్వదా = ఎల్లప్పుడు; ఏకదా=ఒకప్పుడు; అన్యదా = వేఱొకప్పుడు; కదా=ఎప్పుడు; యదా=ఎప్పుడైతే; తదా=అప్పుడు.

ర్హిల్ - ఏతర్హి = ఇప్పుడు; కర్హి = ఎప్పుడు; యర్హి = ఎప్పుడైతే; తర్హి=అప్పుడు.

అధునా - అధునా=ఇప్పుడు.

దానీమ్ - ఇదానీమ్=ఇప్పుడు; తదానీమ్=అప్పుడు.

ద్యస్ - సద్యః=సమానమైన దినమున, వెంటనే.

ఉత్ - పరుత్=కడచిన సంవత్సరమున, నిరుడు.

అరిః - పరారి=ముందటియేట, కడచిన ఏటికి వెనుకటియేట.

సమసణ్ - ఐషమః=ఈ సంవత్సరమున.

ఏద్యవి - పరేద్యవి = మఱునాడు.

ద్యః - అద్య=నేడు, ఈ దినము.

ఏద్యుస్ - పూర్వేద్యుః=నిన్న; అన్యేద్యుః=వేఱొకనాడు; అన్యతరేద్యుః, ఇతరేద్యుః, అధరేద్యుః=వేఱొకనాడు; అపరేద్యుః=

మఱునాడు; ఉభయేద్యుః = నిన్నను, మరునాడును; ఉత్త
రేద్యుః=మఱునాడు.

ద్యుస్ - ఉభయేద్యుః=నిన్న, రేపు.

థాల్ - సర్వథా=అన్నివిధముల; యథా=ఎట్లన; తథా = అట్లు.

థముః - ఇత్థమ్=ఇట్లు; కథమ్=ఎట్లు.

అస్తాతిః - పురస్తాత్=ముందు; పరస్తాత్ = వెనుక; అథస్తాత్ = దిగువ;
అవస్తాత్=క్రింద; అపరస్తాత్ = వెనుక; అవరస్తాత్=వెనుక.

అసిః - పురః=ఎదుట; అధః = క్రింద.

అతసుచ్ - దక్షిణతః=దక్షిణముగా; ఉత్తరతః=ఉత్తరముగా; పరతః
= వెనుకగా; అవరతః=వెనుకగా.

అస్తాతిలుక్ - ప్రాక్=తూర్పున; ప్రత్యక్=పడమట; ఉదక్=ఉత్తర
మున.

రిల్ - ఉపరి=మీద.

రిష్టాతిల్ - ఉపరిష్టాత్=మీదగా.

ఆతిః - పశ్చాత్=వెనుక; ఉత్తరాత్=ఉత్తరమున; అథరాత్=క్రింద;
దక్షిణాత్=దక్షిణమున.

ఏనప్ - ఉత్తరేణ=ఉత్తరమున; అధరేణ = క్రింద; దక్షిణేన=దక్షిణ
మున.

ఆచ్ - దక్షిణా = దక్షిణమున; ఉత్తరా=ఉత్తరమున.

ఆహి - దక్షిణాహి=దక్షిణమున; ఉత్తరాహి=ఉత్తరమున.

ధా - ఏకధా=ఒక విధముగా; ద్విధా=రెండు విధములుగా; త్రిధా=
మూడువిధములుగా; చతుర్ధా=నాలుగువిధములుగా; పఞ్చధా=

ఐదువిధములుగా; షోఢా=ఆఱువిధములుగా; సప్తధా=ఏడు విధములుగా; బహుధా=పెక్కువిధములుగా.

ధ్యాముఞ్ - ఐకధ్యమ్=ఒక్కవిధముగా.

ధముఞ్ - ద్వైధమ్=రెండువిధములుగా; త్రైధమ్ = మూడువిధములుగా.

ఏధాచ్ - ద్వేధా=రెండు విధములుగా; త్రేధా = మూడు విధములుగా.

కృత్వసుచ్ - పఞ్చకృత్వః=ఐదుసార్లు; షట్కృత్వః=ఆఱుసార్లు.

సుచ్ - ద్విః=రెండుసార్లు; త్రిః=మూడుసార్లు; చతుః = నాలుగు సార్లు.

సుఙ్ణుక్ - సకృత్=ఒక్కసారి.

శస్ - బహుశః=ఎక్కువగా; అల్పశః=తక్కువగా; ద్విశః=రెండు సార్లుగా; త్రిశః=మూడుసార్లుగా; మాషశః = మాషప్రమాణముగా; ప్రస్థశః=కుంచము ప్రమాణముగా.

తసిః - కృష్ణతః=కృష్ణునివలన; అర్జునతః=అర్జునునివలన; ఆదితః = మొదటినుండి; అన్తతః=చివరినుండి; సర్వతః=అంతటను; వర్ణతః =వర్ణమువలన.

చ్విః - కృష్ణీ (భవతి)=కృష్ణుడుగా (అగును); గంగీ (స్యాత్)= గంగగా (అగును).

సాతిః - అగ్నిసాత్ (భవతి)=అగ్నిపరము (అగును); విప్రసాత్(కరోతి) =విప్రులపరము (చేయును).

త్రా - విప్రత్రా (కరోతి)=విప్రుడుగా (చేయును); దేవత్రా (కరోతి) =దేవతగా (చేయును); మనుష్యత్రా (కరోతి)=మనుష్యుడుగా (చేయును).

డాచ్ - పటపటా (కరోతి) = పటపట శబ్దము (చేయును); భద్రా (కరోతి)= మేలు (చేయును); ప్రియా (కరోతి) = ప్రియము (చేయును); సుఖా (కరోతి)=సుఖము (చేయును).

ఇత్యవ్యయాని

అవ్యయములు ముగిసినవి.

---

# సమాస కుసుమావళిః

## సమాస కుసుమావళి

సంస్కృత భాషయందలి సుబంతపదములు వ్యస్తములుగా, సమస్తములుగా ఉండును. దేనికది విడివిడిగా ఉన్నవి వ్యస్తపదములు- రామః, కథా మొదలైనవి. కొన్ని పదములు కలిసి ఏకపదముగా నేర్పడినవి సమస్తపదములు-రామకథా, దండకా వనవాసః మున్నగునవి. సమర్థములైన పదములు ఏకపదమగుట సమాసము అనబడును. సమాసమందలి పదములను దాని పరస్పరసంబంధము స్పష్టపడునట్లు వేరుచేసినచో నేర్పడునది అనగా సమాసము నర్థమును దెలుపునది విగ్రహవాక్యము.

రామకథా-సమాసము. -రామస్య కథా-విగ్రహము.

దండకా వనవాసః-సమాసము. -దండకా ఇతి వనే వాసః-విగ్రహము.

సంస్కృతభాషయందలి సమాసములు సంగ్రహముగా ఆఱువిధములు. వానిలో మరల అవాంతర భేదములు కలవు.

| సమాసభేదము | అవాంతరభేదములు |
|---|---|
| 1. తత్పురుష సమాసము | 8 |
| 2. కర్మధారయ సమాసము | 7 |
| 3. ద్విగుసమాసము | 2 |
| 4. బహువ్రీహి సమాసము | 7 |
| 5. అవ్యయీభావ సమాసము | 2 |
| 6. ద్వంద్వసమాసము | 4 |

పై ఆరువిధములలో చేరని సమాసవిశేషములు కొన్ని కలవు- అలుక్సమాసము, గతిసమాసము, నిత్యసమాసము, అసమర్థసమాసము, కృదాదివృత్తులు మొదలైనవి.

## అవతారిక.

శ్లో. భూనాయకం వా ధననాయకం వా
భజన్ భువం వా ధనమేతి లోకే,
తద్విఘ్ననాథం న భజామి కింతు
సహస్రశస్తం ప్రణమామి నిత్యం. 1

లోకమున మనుజుడు భూనాయకుని సేవించి భూమిని, ధననాయకుని సేవించి ధనమును పొందును. కనుక నేను విఘ్ననాయకుని సేవింపను. నిత్యము అతనికి వేయిసార్లుగా ప్రణమిల్లుదును.

శ్లో. శ్రీమత్పాణిని సూత్రాణి సమాలోచ్య యథామతి,
బాలవ్యుత్పత్తయే కుర్మ స్సమాసకుసుమావళిమ్. 2

పాణిని మహాముని సూత్రములను యథామతి పరిశీలించి బాలురకు పరిజ్ఞానము కలుగుటకై 'సమాస కుసుమావళిని' రచింతుము.

## తత్పురుషసమాస నిరూపణమ్.

శ్లో. తత్పురుషోఽష్టవిధోఽభూ
త్ప్రథమాదివిభక్తి నఞ్ కృతై ర్భేదైః,
ఉత్తరపదజనితార్థో
ముఖ్య స్తత్రేతి పణ్డితైః ఖ్యాతః. 3

ప్రథమ మున్నగు సప్తవిభక్తులు, నఞ్ భేదములచే తత్పురుష సమాసము ఎనిమిది విధములు. అందు ఉత్తరపదము యొక్క అర్థము ముఖ్యము అని పండితులు చెప్పుదురు.

### 1. ప్రథమా తత్పురుషః

శ్లో. అమృతం యోఽపిబద్దైత్య
స్తం వైకుణ్ఠో ద్విధాఽచ్ఛినత్
రాహు రుత్తరకాయోఽస్య
పూర్వకాయోఽభవద్ధ్వజః. 4

అమృతపానము చేసిన రాక్షసుని శ్రీ విష్ణువు రెండుగా ఖండించెను. వాని ఉత్తరకాయము రాహువు, పూర్వకాయము కేతువు నయ్యెను.

ఉత్తరః కాయస్య "ఉత్తరకాయః"; "పూర్వః కాయస్య" "పూర్వకాయః"; అర్ధం పిప్పల్యాః-"అర్ధపిప్పలీ" ఇత్యేవమాదయః.

ఉదా : కాయముయొక్క ఉత్తరము - ఉత్తరకాయము, కాయముయొక్క పూర్వము - పూర్వకాయము, పిప్పలియొక్క అర్ధము - అర్ధపిప్పలి- మున్నగునవి.

## 2. ద్వితీయా తత్పురుషః.

శ్లో. దుఃఖాతీతో భవత్యేన యది కృష్ణశ్రితో జనః,
అథవాఽన్నబుభుక్షుస్సన్ ముహూర్తసుఖమశ్నుతే. 5

జనుడు కృష్ణశ్రితుడైనచో దుఃఖాతీతు డగును. లేని యెడల అన్న బుభుక్షుడై ముహూర్త సుఖమును అనుభవించును.

దుఃఖమతీతో - దుఃఖాతీతః; కృష్ణం శ్రితః - కృష్ణశ్రితః; అన్నం బుభుక్షుః - అన్నబుభుక్షుః; ముహూర్తం సుఖమ్-ముహూర్తసుఖమ్; ఖట్వామారూఢః-ఖట్వారూఢః ఇత్యాదయః.

ఉదా : దుఃఖమును అతీతుడు - దుఃఖాతీతుడు, కృష్ణుని శ్రితుడు - కృష్ణశ్రితుడు, అన్నమును బుభుక్షువు - అన్న బుభుక్షువు, ముహూర్తము గూర్చిన సుఖము-ముహూర్తసుఖము, ఖట్వమును ఆరూఢుడు - ఖట్వారూఢుడు- మున్నగునవి.

## 3. తృతీయా తత్పురుషః.

శ్లో. మాసావర స్త్వం ఖలు మాసపూర్వ
స్త్వహం తు విద్యానిపుణో నితాన్తమ్,
ఇతీవ సంసద్యపి బాడబానాం
పరస్పరం వాక్కలహో బభూవ. 1

'నీవు నాకంటె మాసావరుడవు (నెల తక్కువ వాడవు), నేను నీకంటె మాసపూర్వుడను (నెల ఎక్కువవాడను). నేను మిక్కిలి విద్యానిపుణుడను' అని యిట్లు బ్రాహ్మణుల సభయందు పరస్పరము వాక్కలహము జరిగెను.

మాసేన అవరః - మాసావరః, మాసేన పూర్వః-మాస పూర్వః, విద్యయా నిపుణః-విద్యానిపుణః, వాచా కలహః-వాక్కలహః, పిత్రా సదృశః-పితృసదృశః ఇత్యేవ మాదయః.

ఉదా : మాసముచే అవరుడు - మాసావరుడు, మాసముచే పూర్వుడు - మాసపూర్వుడు, విద్యచే నిపుణుడు - విద్యానిపుణుడు. వాక్కుచే కలహము - వాక్కలహము, పితతో సదృశుడు - పితృ సదృశుడు మున్నగునవి.

## 4. చతుర్థీ తత్పురుషః.

శ్లో. గృహీ భూతబలిం దత్తే గోసుఖం తు కృషీవలః,
దత్తే యష్టా యూపదారు కుణ్డలాష్టాపదం బుధః. 7

గృహస్థు భూతబలిని, కృషీవలుడు గోసుఖము కూర్చును. యాజకుడు యూపదారువును, విద్వాంసుడు కుండలాష్టాపదమును సంపాదించును.

భూతేభ్యో బలిః-భూతబలిః; గవే సుఖమ్-గోసుఖమ్; యూపాయ దారు-యూపదారు; కుణ్డలాయ అష్టాపదమ్-కుణ్డలాష్టాపదమ్; గవే హితమ్-గోహితమ్ ఇత్యేవమాదయః.

ఉదా : భూతముల కొఱకు బలి - భూతబలి, గోవు కొఱకు సుఖము - గోసుఖము, యూపము కొఱకు దారువు - యూపదారువు, కుండలము కొఱకు అష్టాపదము - కుండలాష్టాపదము, గోవుకొఱకు హితము - గోహితము- మున్నగునవి.

## 5. పఞ్చమీ తత్పురుషః.

శ్లో. పూర్వం చోరభయం ప్రాప్య వ్యాఘ్రభీత స్తతః పరం,
సుఖాపేతో జన స్సమ్యగరణ్యే నివసేత్కథమ్. 8

మొదట చోరభయమును పొంది, తర్వాత వ్యాఘ్రభీతుడై, సుఖాపేతుడై జనుడు వనములో సుఖముగా నెట్లు జీవించును ?

చోరాద్భయం - చోరభయమ్; వ్యాఘ్రాత్ భీతః- వ్యాఘ్రభీతః; సుఖాత్ అపేతః - సుఖాపేతః; వృక్షాత్ పతితః-వృక్షపతితః ఇత్యేవ మాదయః.

ఉదా : చోరునివలన భయము - చోరభయము, వ్యాఘ్రము వలన భీతుడు - వ్యాఘ్రభీతుడు, సుఖమునుండి అపేతుడు - సుఖా పేతుడు, వృక్షమునుండి పతితుడు - వృక్షపతితుడు- మున్నగునవి.

6. షష్ఠీ తత్పురుషః.

శ్లో. అధికం రాజపురుషస్సేవ్య స్సర్వమహాన్ యతః,
వృక్షమూల ముపాశ్రిత్య జపతో దేవపూజకాత్. 9

వృక్షమూలము నాశ్రయించి జపించుచున్న దేవపూజకునికంటె సర్వోత్కృష్టుడైన రాజపురుషుడే యెక్కువ సేవ్యుడు.

రాజ్ఞః పురుషః-రాజపురుషః; సర్వేషాం మహాత్తరః- సర్వమహాన్; వృక్షస్య మూలమ్-వృక్షమూలమ్; దేవానాం పూజకః- దేవపూజకః; వృక్షాణాం ఛాయా-వృక్షచ్ఛాయమ్, ఇత్యేవ మాదయః.

ఉదా : రాజుయొక్క పురుషుడు - రాజపురుషుడు, సర్వు లలో మహాత్తరుడు - సర్వమహానుడు, వృక్షముయొక్క మూలము - వృక్షమూలము, దేవులయొక్క పూజకుడు - దేవపూజకుడు, వృక్ష ముల యొక్క ఛాయ - వృక్షచ్ఛాయము మున్నగునవి.

## 7. సప్తమీ తత్పురుషః.

శ్లో. ప్రాశ్యాన్నమీశ్వరాధీనం స్థాలీపక్వం తు మానవః,
వర్త్మన్యాతపశుష్కస్సన్ దానశౌణ్డః కథం భవేత్. 10

స్థాలీపక్వము, దైవాధీనము అగు అన్నమును తినుచు, మార్గమున అతపశుష్కుడగు మానవుడు దానశౌండు డెట్లు కాగలడు?

ఈశ్వరే అధీనమ్-ఈశ్వరాధీనమ్; స్థాల్యాం పక్వమ్-స్థాలీపక్వమ్; ఆతపే శుష్కః-ఆతపశుష్కః; దానే శౌణ్డః-దానశౌణ్డః; సాంకాశ్యే సిద్ధః - సాంకాశ్యసిద్ధః. ఇత్యేవమాదయః.

ఉదా : ఈశ్వరునందు అధీనము ఈశ్వరాధీనము, స్థాలియందు పక్వము స్థాలీపక్వము, ఆతపమందు శుష్కుడు ఆతపశుష్కుడు, దానమందు శౌండుడు దానశౌండుడు; సాంకాశ్యమందు సిద్ధుడు సాంకాశ్యసిద్ధుడు-మున్నగునవి.

## 8. నఞ్ తత్పురుషః.

శ్లో. అజ్ఞానాత్పాపమాప్నోతి పాపాదబ్రాహ్మణో భవేత్,
తస్మాదిచ్ఛన్తి తత్త్యక్తుమభవాయైవ పణ్డితాః. 11

మానవు డజ్ఞానమునలన పాపము పొందును. పాపమువలన అబ్రాహ్మణు డగును. అందువలన పండితులు మోక్షమునకై దానిని విడువగోరుదురు.

న జ్ఞానమ్-అజ్ఞానమ్; న బ్రాహ్మణః-అబ్రాహ్మణః, న భవః-అభవః, న అశ్వః-అనశ్వః ఇత్యేవమాదయః.

ఉదా : జ్ఞానము కానిది అజ్ఞానము, బ్రాహ్మణుడు కాని

వాడు అబ్రాహ్మణుడు, భవము కానిది అభవము, అశ్వము కానిది అనశ్వము-మున్నగునవి.

కర్మధారయ సమాస నిరూపణమ్.

శ్లో. కవిభి స్స_ప్తవిధ స్స్యాదిత్యేవం కర్మధారయః కథితః,
తత్పురుషా_న్తర్భావాత్ తద్వత్ప్రాధాన్యమీరితంచాస్య.

శ్లో. విశేషణం పూర్వపదే విశేష్యం
తథోభయత్రాపి విశేషణం చ,
యస్యోపమానం పరత_స్తదాదౌ
సంభావనా చాప్యవధారణా చ. 13

కర్మధారయ సమాస నిరూపణము

పండితులు కర్మధారయము ఏడు విధములైనదని చెప్పుదురు. ఇదియు తత్పురుషములో అంతర్భవించియున్నందున, ఇందును ఉత్తర పదమే ప్రధానమని చెప్పబడినది. విశేషణ పూర్వపదము, విశేష్య పూర్వపదము, విశేషణోభయపదము, ఉపమానో_త్తర పదము, ఉపమాన పూర్వపదము, సంభావనా పూర్వపదము, అవధారణ పూర్వ పదము-అని ఇది ఏడు విధములు.

1. విశేషణ పూర్వపద కర్మధారయః.

శ్లో. నీలోత్పలాని నారీణాం నయనానీవ రేజిరే,
కమ్పితాన్యల్పవాతేన సత్సరస్సు స్థితాన్యహో. 14

చక్కని సరస్సులందున్న నీలోత్పలములు అల్ప వాతముచే కంపితములయి యువతుల నేత్రముల వలె ప్రకాశించినవి. ఔరా !

నీలానిచ తాని ఉత్పలానిచ-నీలోత్పలాని; అల్పశ్చాసౌ వాతశ్చ అల్పవాతః; సన్తి చ తాని సరాంసి చ-సత్సరాంసి; రమ్యా చ సా లతా చ-రమ్యలతా ఇత్యేవ మాదయః.

ఉదా : నీలములైన ఉత్పలములు నీలోత్పలములు. అల్పమైన వాతము అల్పవాతము. సత్తులైన సరస్సులు సత్సరస్సులు. రమ్యమైన లత రమ్యలత-మున్నగునవి.

2. విశేష్య పూర్వపద కర్మధారయః.

శ్లో. ఉద్వీక్ష్య యస్య మాతఙ్గాన్ ఘనా ఇతి మనీషయా,
మయూరవ్యంసకా హృష్టా ననృతు స్తం నృపం భజే.15

ఎవని యేనుగులను చూచి మేఘములనెడి భ్రాంతితో మయూరవ్యంసకములు హృష్టములై నర్తించినవో, అట్టిరాజును సేవింతును.

వ్యంసకాశ్చ తే మయూరాశ్చ - మయూరవ్యంసకాః; ఖసూచిశ్చాసౌ వైయాకరణశ్చ - వైయాకరణఖసూచిః; ఇత్యేవ మాదయః.

ఉదా : వ్యంసకములైన మయూరములు మయూరవ్యంసకములు; ఖసూచియైన వైయాకరణుడు వైయాకరణఖసూచి-మున్నగునవి.

3. విశేషణోభయపద కర్మధారయః

శ్లో. పుంసాం స్నాతానులిప్తానా మన్నం భోజ్యోష్ణ మేవహి,
పథ్య మిత్యబ్రవీద్వైద్య శ్శాస్త్రే నిశ్చప్రచం వచః. 16

స్నాతానులిప్తులైన పురుషులకు భోజ్యోష్ణమగు అన్నమే పథ్యమైనదని వైద్యుడు నిశ్చప్రచమైన మాట చెప్పెను.

స్నాతాశ్చ తే అనులిప్తాశ్చ - స్నాతానులిప్తాః; భోజ్యం చ తత్ ఉష్ణం చ - భోజ్యోష్ణమ్; నిశ్చితం చ తత్ ప్రచితం చ నిశ్చప్రచమ్ ఇత్యేవ మాదయః.

ఉదా : స్నాతులును, అనులిప్తులును ఐనవారు స్నాతానులిప్తులు. భోజ్యమును, ఉష్ణము నైనది భోజ్యోష్ణము. నిశ్చితమును, ప్రచితమును ఐనది నిశ్చప్రచము-ఈ మున్నగునవి.

### 4. ఉపమానోత్తరపద కర్మధారయః.

శ్లో. రామోఽయం పురుషవ్యాఘ్రః సంవృతః కపికుఞ్జరైః,
హనిష్యతి బలాద్యుద్ధే రావణం రాక్షసర్షభమ్. 17

పురుషవ్యాఘ్రమైన ఈ రాముడు కపికుంజరములతో కూడుకొని రాక్షస వృషభుడైన రావణుని యుద్ధమునందు బలవంతముగా చంప గలడు.

పురుషో వ్యాఘ్ర ఇవ - పురుషవ్యాఘ్రః; కపయః కుఞ్జరా ఇవ - కపికుఞ్జరాః; రాక్షసః ఋషభ ఇవ - రాక్షసర్షభః; కవిర్వరాహ ఇవ - కవివరాహః ఇత్యేవ మాదయః.

ఉదా : పురుషుడు వ్యాఘ్రమువలె పురుష వ్యాఘ్రము. కపులు కుంజరములవలె కపికుంజరములు. రాక్షసుడు ఋషభమువలె రాక్షస ఋషభుడు. కవి వరాహమువలె కవివరాహము-మున్నగునవి.

### 5. ఉపమాన పూర్వపద కర్మధారయః.

శ్లో. కౌముదీ విశదా భాతి యా వాణీ రతిసున్దరీ,
లతాతన్వీ సదాదద్యా త్సాన్ద్రాద్రాక్షామధురాం గిరమ్. 18

కౌముదీవిశదయు, రతి సుందరియు, లతా తన్వియు నయి ప్రకాశించు వాణి ఎల్లప్పుడును ద్రాక్షామధురమైన వాక్కును ప్రసాదించునుగాక !

కౌముదీవ విశదా - కౌముదీవిశదా; రతిరివ సున్దరీ - రతిసున్దరీ; లతేవ తన్వీ - లతాతన్వీ; ద్రాక్షేవ మధురా - ద్రాక్షామధురా; ఘన ఇవ శ్యామః - ఘనశ్యామః ఇత్యేవ మాదయః.

ఉదా : కౌముదివలె విశద కౌముదీవిశద. రతివలె సుందరి రతి సుందరి. లతవలె తన్వి లతా తన్వి. ద్రాక్షవలె మధుర ద్రాక్షా మధుర. ఘనమువలె శ్యాముడు ఘన శ్యాముడు-మున్నగునవి.

6. సంభావనాపూర్వపద కర్మధారయః.

శ్లో. తమాలవృక్షై రభిత స్సంవృతో విన్ధ్యపర్వతః,
బమ్భరై స్సకలై ర్దృష్టో, దూరా ద్గజమనీషయా. 19

తమాల వృక్షములచే అంతటను ఆవరింపబడియున్న వింధ్య పర్వతము తుమ్మెదలచే దూరమునుండి గజభ్రాంతితో చూపబడినది.

తమాలా ఇతి వృక్షాః - తమాలవృక్షాః; విన్ధ్య ఇతి పర్వతః-విన్ధ్యపర్వతః; గజ ఇతి మనీషా - గజమనీషా; మేఘ ఇతి ఛలం-మేఘచ్ఛలమ్ ఇత్యేవ మాదయః.

ఉదా : తమాలములనెడి వృక్షములు తమాల వృక్షములు. వింధ్యమనెడి పర్వతము వింధ్య పర్వతము. గజమనెడి మనీష గజ మనీష. మేఘమనెడి ఛలము మేఘచ్ఛలము-మొదలైనవి.

7. అవధారణాపూర్వపద కర్మధారయః.

శ్లో. మనీషాసలిలై ర్వ్యుక్తి రత్నై ర్వా కల్పనోర్మిభిః,
యశస్పరిద్భి స్సంపన్నో భాత్యయం కవిసాగరః. 20

ఈ కవి సముద్రము మనీషాసలిలములతోను, యుక్తిరత్నముల తోను, కల్పనోర్ములతోను, యశస్సరిత్తులతోను కూడి ప్రకాశించు చున్నది.

మనీషా ఏవ సలిలాని - మనీషా సలిలాని; యుక్తయః ఏవ రత్నాని - యుక్తిరత్నాని; కల్పనా ఏవ ఊర్మయః - కల్పనోర్మయః; యశాంస్యేవ సరితః-యశస్సరితః; కవిరేవ సాగరః - కవిసాగరః; వినయ ఏవ ధనం - వినయ ధనమ్ ఇత్యేవ మాదయః.

ఉదా : మనీషయే సలిలములు మనీషా సలిలములు. యుక్తులే రత్నములు యుక్తిరత్నములు. కల్పనయే ఊర్ములు కల్పనోర్ములు. యశస్సులే సరిత్తులు యశస్సరిత్తులు. కవియే సాగరము కవి సాగరము వినయమే ధనము వినయధనము-మొదలైనవి. (అవధారణ అనగా నిశ్చయము. దీనికి రూపక సమాసమని నామాంతరము).

## ద్విగుసమాస నిరూపణమ్.

శ్లో. సచైక వద్భావ్యనేకవద్భావీతి ద్విధా ద్విగుః,
కర్మధారయ ఏవాస్యా ప్యన్తర్భావో బుధైర్మతః. 21

ద్విగు సమాసము కర్మధారయ సమాసమునందే అంతర్భవించును. ఇది (1) ఏకవద్భావి, (2) అనేకవద్భావి-అని రెండు విధములు.

### 1. ఏకవద్భావీ ద్విగుః.

శ్లో. పఞ్చవట్యా సమం క్షేత్రం త్రిలోక్యాం నహి విద్యతే,
తత్ర పఞ్చగవం దత్త్వా జన శ్శ్రేష్ఠపదం వ్రజేత్. 22

పంచవటితో సమానమగు క్షేత్రము ముల్లోకము నందును లేదు. అక్కడ పంచగవమును దానము చేసి జనుడు ఉత్తమ పదమును పొందును.

పఞ్చానాం వటానాం సమాహారః - పఞ్చవటీ; త్రయాణాం లోకానాం సమాహారః - త్రిలోకీ; పఞ్చానాం గవాం సమాహారః - పఞ్చగవమ్; త్రయాణాం భువనానాం సమాహారః-త్రిభువనమ్ ఇత్యేవమాదయః.

ఉదా : పంచవటముల సమాహారము పంచవటి. త్రిలోకముల సమాహారము త్రిలోకి. పంచ గోవుల సమాహారము పంచగవము. త్రిభువనముల సమాహారము త్రిభువనము- మొదలైనవి.

2. అనేకపదాభావి ద్విగుః.

శ్లో. యుద్ధేషు విబుధా స్సర్వే బాడబా శ్చాధ్వరేష్వపి,
గాయన్తియం కార్యసిద్ధ్యై భజే షాణ్మాతురం ముదా.23

యుద్ధములందు సర్వదేవతలును, యాగములందు సర్వ బ్రాహ్మణులును కార్యసిద్ధికొఱ కెవ్వనిని కీర్తింతురో, ఆ షాణ్మాతురుని ప్రీతితో సేవింతును.

షణ్ణాం మాతౄణామ్ అపత్యం పుమాన్ - షాణ్మాతురః; అష్టసు కపాలేషు సంస్కృతః పురోడాశః - అష్టాకపాలః ఇత్యేవమాదయః.

ఉదా : షట్ మాతల అపత్యమైన పురుషుడు షాణ్మాతురుడు, అష్ట కపాలములందు సంస్కృతమైన పురోడాశము అష్టాకపాలము - మున్నగునవి.

## బహువ్రీహిసమాస నిరూపణమ్.

శ్లో. సప్తభిరాఖ్యాభిర్వా విఖ్యాతో యస్సవై బహువ్రీహిః,
అన్యపదార్థో ముఖ్యః కథితో విబుధై ర్బహువ్రీహౌ. 24

శ్లో. ద్వాభ్యాం పదాభ్యాం బహుభిః పదైర్వా
సంఖ్యోభయో స్స్యా పదయోః పదాగ్రే,
య స్స్యాభవ త్పూర్వపదే సహాశ్చ
దిగన్తరాళ వ్యతిహారలక్ష్మా. 25

బహువ్రీహి సమాసము ఏడు విధములుగా నుండును. బహువ్రీహి సమాసమున, సమాసమందున్న పదములకంటె ఇతరమైన పదము యొక్క అర్థము ప్రధానముగా నుండునని పండితులు చెప్పుదురు. (1) ద్విపద బహువ్రీహి. (2) బహుపద బహువ్రీహి. (3) సంఖ్యోభయపద బహువ్రీహి. (4) సంఖ్యోత్తరపద బహువ్రీహి. (5) సహాపూర్వపద బహువ్రీహి. (6) దిగన్తరాళ లక్షణ బహువ్రీహి, (7) వ్యతిహార లక్షణ బహువ్రీహి-అనునవి బహువ్రీహి యందలి భేదములు.

### 1. ద్విపదబహువ్రీహిః

శ్లో. ప్రాప్తాగ్ని మేవమిషు మూఢరథానథాశ్వాం
స్తూణీర ముద్ధృతశరం చ వహన్ జవేన,
రుద్రోఽపి వీర పురుషా స్సపురో బిభేద
దేవైశ్చ దత్తపశు రేవ మహాబలస్సన్. 26

ప్రాప్తాగ్నియైన ఇషువును, ఊఢరథములగు అశ్వములను, ఉద్ధృత శరమగు తూణీరమును వహించుచు దేవతలచే దత్తపశుడై మహాబలుడగు రుద్రుడు వీరపురుషములగు త్రిపురములను భేదించెను.

ప్రాప్తః అగ్నిర్యం సః - ప్రాప్తాగ్నిః; ఊఢో రథః యైస్తే-ఊఢరథాః; దత్తః పశుః యస్మై సః-దత్తపశుః; ఉద్ధృతాః శరాః యస్మాత్సః-ఉద్ధృతశరః; మహత్ బలం యస్య సః-మహాబలః; వీరాః పురుషాః యాసు తాః-వీర పురుషాః ఇత్యేవమాదయః,

ఉదా : దేనిని అగ్ని ప్రాప్తమయ్యెనో అది ప్రాప్తాగ్ని. వేనిచే రథము ఊఢమైనదో అవి ఊఢరథములు. ఎవనికొరకు పశువు దత్తమో అతడు దత్తపశుడు. దేనినుండి శరములు ఉద్ధృతములైనవో అది ఉద్ధృతశరము. మహత్తగు బలము ఎవనికి కలదో అతడు మహాబలుడు. వీరులగు పురుషులు వేనియందు కలరో అవి వీరపురుష ములు-మున్నగునవి.

## 2. బహుపదబహువ్రీహిః.

శ్లో. నీలోజ్జ్వలవపుః పాతు శ్రీమత్పీతామ్బరో హరిః,
యస్యప్రసాదాత్కుబ్జాఽభూ ద్దివ్యసున్దరవిగ్రహా. 27

ఎవని ప్రసాదమువలన కుబ్జ దివ్యసుందర విగ్రహాయయ్యెనో నీలోజ్జ్వలవపువును, శ్రీమత్పీతాంబరుడును అగు ఆ శ్రీహరి రక్షించును గాక !

నీల ముజ్జ్వలం చ వపుః యస్య సః-నీలోజ్జ్వలవపుః; శ్రీమత్ పీతమ్ చ అమ్బరం యస్య సః - శ్రీమత్పీతామ్బరః; దివ్యః సున్దరశ్చ విగ్రహః యస్యాః సా-దివ్యసున్దరవిగ్రహా; ఇత్యేవమాదయః.

ఉదా : నీలమును, ఉజ్జ్వలమును అగు వపు వెవ్వనికి కలదో అతడు నీలోజ్జ్వల వపువు. శ్రీమంతము, పీతమును అగు అంబరము

ఎవ్వనికి కలదో అతడు శ్రీమత్పీతామ్బరుడు. దివ్యమును, సుందరమును అగు విగ్రహ మెవ్వతెకు కలదో ఆమె దివ్యసుందరవిగ్రహ-మున్నగునవి.

### 3. సంఖ్యోభయపదబహువ్రీహిః.

శ్లో. కాననేఽస్మిన్మహారాజన్ ద్విత్రైరాయాసితా జనైః,
లభ్యాస్తే పఞ్చషా నాగా ఇత్యూచు ర్బలినః ప్రభుమ్. 28

'ఓ రాజా! ఈ యడవియందు ద్విత్రులైన జనులచే చికాకు పెట్టబడి, పంచషములైన ఏనుగులు లభ్యములగు' నని బలవంతులు ప్రభువుతో పలికిరి.

ద్వౌ వా త్రయో వా-ద్విత్రాః; పఞ్చవా షడ్వా-పఞ్చషాః; త్రయో వా చత్వారో వా-త్రిచతురాః. ఇత్యేవ మాదయః.

ఉదా : ద్వి గాని త్రయముగాని ద్విత్రములు; పఞ్చగాని షట్టు గాని పంచషములు. త్రయముగాని చత్వారముగాని త్రిచతురములు-మున్నగునవి.

### 4. సంఖ్యోత్తరపదబహువ్రీహిః.

శ్లో. బ్రహ్మాణః కతి వా రుద్రా వదన్త మితి సంఖ్యయా,
కుశలస్త్వేకయా యుక్త్యా వదే దుపదశా ఇతి. 29

సంఖ్యచే బ్రహ్మలెందరు, రుద్రులెందరు అని పలుకువానికి కుశలుడు యుక్తిగా ఒక్క పదముతో 'ఉపదశులు' అని చెప్పును. (దశకు సమీపమున ఉన్నవారు ఉపదశులు. బ్రహ్మలు తొమ్మిదిమంది, రుద్రులు పదునొకండు మంది. ఇర్వురును ఉపదశులే).

దశానాం సమీపే యే సన్తి తే-ఉపదశాః ఇత్యేవ మాదయః

ఉదా : పళకు సమీపమున ఎవ్వరున్నారో వారు ఉపదశులు మొదలైనవి.

5. సహపూర్వపద బహువ్రీహిః.

శ్లో. సకలాస్సహసంతానా స్సకలా అపి బాడబాః,
ప్రోచుస్స్వస్తిమహీపాయ సహపుత్రాయ సన్తతమ్. 30

సకళులును సహసంతానులును అగు సకల బ్రాహ్మణులును సహ పుత్రుడైన భూపతికి సంతతము స్వస్తి చెప్పుచుండిరి.

కలాభిస్సహ వర్తన్త ఇతి-సకలాః; సంతానైస్సహ వర్తన్త ఇతి-సహసంతానాః; పుత్రేణ సహ వర్తత ఇతి-సహపుత్రః ఇత్యేవమాదయః.

ఉదా : కళలతో సహ వర్తించు వారు సకళులు. సంతానములతో సహ వర్తించుచున్నవారు సహ సంతానులు. పుత్రునితో సహ వర్తించుచున్నవాడు సహ పుత్రుడు-మున్నగునవి.

6. దిగన్తరాళలక్షణ బహువ్రీహిః.

శ్లో. విద్యుదుత్తరపూర్వాయా మమోఘోమారుతోఽథవా,
యది దక్షిణపూర్వాయాం వృష్టిర్నైవ భవేత్తదా. 31

ఉత్తరపూర్వయందు (ఈశాన్యదిక్కున) మెరుపుగాని, దక్షిణపూర్వయందు (ఆగ్నేయ దిక్కున) అమోఘమైన మారుతముగాని ఉండునెడల వర్షము ఉండదు.

ఉత్తరస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశో ర్యదన్తరాళం సా-ఉత్తరపూర్వా; దక్షిణస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశోర్యదన్తరాళం సా-దక్షిణపూర్వా-ఇత్యేవమాదయః.

ఉదా : ఉత్తరము, పూర్వము అగు దిక్కుల అంతరాళము ఉత్తరపూర్వము. దక్షిణము, పూర్వము అగు దిక్కుల అంతరాళము దక్షిణపూర్వము-మున్నగునవి.

7. వ్యతిహారలక్షణ బహువ్రీహిః.

శ్లో. బాహూబాహవి కేషాంచి న్ముష్టీ ముష్ట్యద్భుతం తథా,
కేశాకేశ్యభవ ద్యుద్ధం వానరాణాం చ రక్షసామ్. 32

కొందరికి బాహూ బాహవిగాను, కొందరికి ముష్టిముష్టిగాను, కొందరికి కేశాకేశిగను వానరులకు రాక్షసులకు యుద్ధము అద్భుతముగా జరిగెను.

బాహుభి ర్బాహుభిశ్చ గృహీత్వేదం యుద్ధం ప్రవృత్తం-బాహూబాహవి; ముష్టిభిర్ముష్టిభిశ్చ ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తం-ముష్టీముష్టి; కేశేషు కేశేషు గృహీత్వేదం యుద్ధం ప్రవృత్తం - కేశాకేశి ఇత్యేవమాదయః.

ఉదా : బాహువులచేతను, బాహువులచేతను పట్టుకొని ప్రవృత్తమైన యుద్ధము బాహూబాహవి; ముష్టులచేతను, ముష్టులచేతను పొడిచి ప్రవృత్తమైన యుద్ధము ముష్టీముష్టి; కేశములందును, కేశము లందును పట్టుకొని ప్రవృత్తమైన యుద్ధము కేశాకేశి- మొదలైనవి.

అవ్యయీభావసమాస నిరూపణమ్.

శ్లో. యస్యాభవ త్పూర్వపదేఽవ్యయస్య
నామ్నోవిధానా ద్ద్వివిధం చ లక్ష్మ,
పూర్వః పదార్థోఽపి చ యత్ర ముఖ్య
స్త మవ్యయీభావ ముదాహరామః.

పూర్వపదమున అవ్యయమునుగాని, నామవాచకమునుగాని ఉంచుటవలన దేనికి రెండు భేదములు ఏర్పడెనో, దేనియందు పూర్వ పదము నర్థము ముఖ్యమో ఆ అవ్యయీభావమును వివరింతుము.

## 1. అవ్యయపూర్వపదావ్యయీభావః.

శ్లో. భోరాజన్ ప్రత్యహంభూయా ద్యథాశక్త్యధిబాడబమ్,
భక్తిస్తయాఽస్తు సంభద్రం నిష్పాప ముపలోచనమ్.

ఓ రాజా ! ప్రత్యహము బ్రాహ్మణులందు యథాశక్తి భక్తిని కలిగి యుండవలెను. దానిచేత కన్నుల యెదుట నీకు నిష్పాపము సంభద్రము కలుగునుగాక.

అహన్యహని-ప్రత్యహమ్; శక్తిమనతిక్రమ్య - యథా శక్తి; బాడబేషు అధి అధిబాడబమ్; భద్రాణాం సమృద్ధిః-సంభద్రమ్; పాపానామభావో - నిష్పాపమ్; లోచనయో స్సమీపే-ఉపలోచనమ్ ఇత్యేవమాదయః.

ఉదా : అహమున, అహమున ప్రత్యహము. శక్తిని అతిక్ర మింపక యథాశక్తి. బాడబులయందు అధి బాడబము. భద్రముల సమృద్ధి సంభద్రము పాపముల అభావము నిష్పాపము. లోచనముల సమీపమున ఉపలోచనము-మున్నగునవి.

## 2. నామపూర్వపదావ్యయీభావః.

శ్లో. స్వస్యాపి భోజనే యస్య సూపప్రతి న యుజ్యతే,
శాకప్రత్యథవాఽన్యేభ్యః కథం దాస్యతి స ప్రభుః. 35

ఎవనికి తన భోజనమునందే సూపలేశముగాని, శాక లేశముగాని లేదో అట్టి ప్రభు వితరుల కెట్లీయగలడు ?

సూపస్య లేశః - సూపప్రతి; శాకస్య లేశః - శాక ప్రతి ఇత్యేవమాదయః.

ఉదా : సూపముయొక్క లేశము సూపప్రతి. శాకముయొక్క లేశము శాకప్రతి-మున్నగునవి.

## ద్వన్ద్వసమాసనిరూపణమ్.

శ్లో. అస్మిన్సమాసే ప్రాధాన్య ముభయోస్స్యాత్పదార్థయోః,
స హి ద్వన్ద్వశ్చతుర్ధా స్యాద్బుధై రితి వినిశ్చితః. 36

శ్లో. ఇతరేతరయోగాఖ్య స్సమాహారాహ్వాయ స్తథా,
ద్వాభ్యాం పదాభ్యాం బహుభి రుభౌ చేతి చతుర్విధః. 37

ద్వన్ద్వ సమాసమున ఉభయ పదార్థములకును ప్రాధాన్య ముండును. అది (1) ద్విపదేతరేతరయోగము (2) బహుపదేతరేతర యోగము (3) ద్విపద సమాహారము (4) బహుపద సమాహారము, అని నాలుగు విధములని పండితులు చెప్పుదురు.

### 1. ద్విపదేత రేతర యోగద్వన్ద్వః.

శ్లో. యయో ర్బలేన సమితౌ నిహతౌ కంస రావణౌ,
సూర్యాచన్ద్రమసో ర్వంశ్యౌ రామకృష్ణావహం భజే. 38

ఎవ్వరి బలముచే యుద్ధమునందు కంసరావణులు చంపబడిరో, సూర్యాచంద్రముల వంశములందు జనించిన ఆ రామకృష్ణులను నేను భజింతును.

కంసశ్చ రావణశ్చ - కంసరావణౌ; సూర్యశ్చ చన్ద్రమాశ్చ-సూర్యాచన్ద్రమసౌ; రామశ్చ కృష్ణశ్చ-రామకృష్ణౌ ఇత్యాదయః.

ఉదా : కంసుడును రావణుడును కంసరావణులు. సూర్యుడును చంద్రముడును సూర్యాచంద్రములు. రాముడును కృష్ణుడును రామకృష్ణులు-మున్నగునవి.

## 2. బహూపదేతరేతర యోగద్వన్ద్వః.

శ్లో. వాపీకూపతటాకానాం మహతాం స్థాపనాదపి,
ధర్మార్థకామ మోక్షాశ్చ సిధ్యన్తే నాత్రసంశయః. 39

గొప్పవైన వాపీకూపతటాకములను నిర్మించుటవల్ల కూడ ధర్మార్థకామ మోక్షములు సిద్ధించును. ఇందు సందియము లేదు.

వాపీ చ కూప శ్చ తటాకశ్చ - వాపీకూపతటాకాః; ధర్మ శ్చ అర్థ శ్చ కామశ్చ మోక్షశ్చ - ధర్మార్థకామ మోక్షాః; ఘటశ్చ పటశ్చ కుడ్యం చ - ఘటపటకుడ్యాని ఇత్యాదయః.

ఉదా : వాపియు, కూపమును, తటాకమును వాపీకూపతటాకములు. ధర్మమును, అర్థమును, కామమును, మోక్షమును ధర్మార్థ కామ మోక్షములు. ఘటమును, పటమును, కుడ్యమును ఘటపట కుడ్యములు-మున్నగునవి.

## 3. ద్విపదసమాహారద్వన్ద్వః.

శ్లో. శీతోష్ణం సుఖదుఃఖం వా సహన్ యో వర్తతే సదా,
నియమ్య వాక్త్వచం సమ్యక్సహి యోగీతి కథ్యతే. 40

ఎవ్వడు ఎల్లప్పుడును శీతోష్ణమును, సుఖదుఃఖమును సహించుచు, వాక్త్వచమును బాగుగా నియమించుచుండునో, అతడు యోగి యని చెప్పబడును.

శీతం చ ఉష్ణం చ తయోస్సమాహారః శీతోష్ణమ్; సుఖం చ దుఃఖం చ తయోస్సమాహారః సుఖదుఃఖమ్; వాక్చ త్వక్చ తయోస్సమాహారః వాక్త్వచమ్ - ఇత్యేవ మాదయః.

ఉదా : శీతముయొక్కయు ఉష్ణముయొక్కయు సమాహారము శీతోష్ణము. సుఖముయొక్కయు దుఃఖముయొక్కయు సమాహారము సుఖదుఃఖము. వాక్కుయొక్కయు త్వక్కుయొక్కయు సమాహారము వాక్త్వచము - మున్నగునవి.

4. బహుపద సమాహారద్వన్ద్వః.

శ్లో. ఢక్కామృదఙ్గపటహం యస్య దధ్వాన మన్దిరే,
అశ్వహస్తిరథం యస్య భావుకం తస్య భూభృతః. 41

ఎవ్వని భవనమునందు ఢక్కా మృదంగపటహము ధ్వనించునో, అశ్వహస్తి రథముండునో ఆ రాజునకు శుభము కలుగును.

ఢక్కా చ మృదఙ్గశ్చ పటహశ్చ తేషాం సమాహారః ఢక్కామృదఙ్గపటహమ్; అశ్వశ్చ హస్తీ చ రథశ్చ తేషాం సమాహారః — అశ్వహస్తిరథమ్; పాణిశ్చ పాదశ్చ గ్రీవా చ తేషాం సమాహారః — పాణిపాదగ్రీవమ్ ఇత్యేవమాదయః.

ఉదా : ఢక్కాయొక్కయు మృదంగముయొక్కయు పటహము యొక్కయు సమాహారము ఢక్కామృదంగపటహము. అశ్వము యొక్కయు, హస్తియొక్కయు, రథముయొక్కయు సమాహారము అశ్వ హస్తి రథము. పాణియొక్కయు పాదముయొక్కము గ్రీవము యొక్కయు సమాహారము పాణి పాద గ్రీవము-మున్నగునవి.

## అలుక్సమాసః

శ్లో. కణ్ఠేకాలం స్మరన్నేవ జనుషాన్ధో హృది స్పృశన్,
వాచోయుక్తిం వదన్ జీవత్యన్తికా దాగతం ప్రతి.

జనుషాంధుడగు జనుడు హృదయమునకు తాకునట్లు కంఠే కాలుని స్మరించుచునే, అంతికాదాగతుని గూర్చి వాచోయుక్తిని పలుకుచు జీవించుచున్నాడు.

కణ్ఠే కాలో యస్య సః - కణ్ఠేకాలః; జనుషా అన్ధః - జనుషాన్ధః; హృది స్పృశతీతి - హృదిస్పృక్; వాచః యుక్తిః - వాచోయుక్తిః; అన్తికాత్ ఆగతః - అన్తికాదాగతః; పశ్యతో హారతీతి - పశ్యతోహారః ఇత్యేవమాదయః.

ఉదా : కంఠమందు కాలము (నలుపు) కలవాడు కంఠే కాలుడు; జనుస్సు (పుట్టుక) చే అంధుడు జనుషాంధుడు; హృదయము నందు స్పృశించునది హృదిస్పృక్; వాక్కుయొక్క యుక్తి వాచో యుక్తి; అంతికమునకు ఆగతుడు అంతికాదాగతుడు; చూచుచుండ (పశ్యతః) హరించువాడు పశ్యతోహారుడు-మున్నగునవి.

సమాసమందలి పూర్వపదము యొక్క విభక్తి లోపించును. అట్లు లోపించనిది అలుక్సమాసము. పై యుదాహరణము లందలి కంఠే, జనుషా, హృదిమున్నగు పదములు విభక్త్యంతములు. ప్రత్య యములు లోపించలేదు.

## గతిసమాసః

శ్లో. సాక్షాత్కృత్య హరిం సమ్యగలంకృత్య పురం ప్రభో,
తిరస్కృత్యరిపూన్ప్రాహి పురస్కృత్య ద్విజాన్ భువమ్.

8

ఓ రాజా! హరిని సాక్షాత్కారము చేసుకొని పురమును చక్కగా అలంకరించి, శత్రువులను తిరస్కరించి, ద్విజుల గౌరవించి భూమిని కాపాడుము.

సాక్షాత్ కృత్వా - సాక్షాత్కృత్య; అలంకృత్వా - అలంకృత్య; తిరఃకృత్వా - తిరస్కృత్య; పురఃకృత్వా - పురస్కృత్య; ఊరీకృత్వా - ఊరీ కృత్య ఇత్యేవమాదయః.

ఈ యుదాహరణములందలి సాక్షాత్, అలం, తిరస్, పురస్, ఊరీ శబ్దములు 'గతి' సంజ్ఞకలవి. ఇవి పూర్వ పదములుగా నున్నవి గతి సమాసములు. సాక్షాత్ కృత్వా-ఇవి వ్యస్తపదములు. సమాస మైనప్పుడు సాక్షాత్కృత్య-అగును. ఊరీ-కృత్వా=ఊరీకృత్య (అంగీక రించి). తక్కినవియు నిట్లే.

నిత్యసమాసః

శ్లో. కుమ్భకార స్తన్తు వాయో లోహకారక ఏవ చ,
శ్రేణయో౽న్యే౽పి సంస్థాప్యాః పార్శ్వే గ్రామస్య యత్నతః.

కుంభకారుడు, తంతువాయుడు, లోహకారుడు ఈ మున్నగు శ్రేణులను గ్రామముయొక్క పార్శ్వమునందు ఏర్పరచవలెను.

కుమ్భం కరోతీతి-కుమ్భకారః; తన్తుం వయతీతి - తన్తు వాయః; లోహం కరోతీతి-లోహకారః; తాపిఞ్ఛేన నిభాః - తాపిఞ్ఛ నిభాః ఇత్యేవమాదయః.

కుంభమును చేయువాడు కుంభకారుడు; తంతువును వయ నము చేయువాడు తంతువాయుడు; లోహమును చేయువాడు లోహకారుడు; తాపింఛముతో నిభుడు తాపించ నిభుడు మున్నగునవి.

శ్లో. శాలాతురీయేణ మహాత్మనా హి
సర్వే సమర్థా విహితాస్సమాసాః,
తేషూపయుక్తా విహితా స్తథాఽస
మర్థం తథా జ్ఞాపకసిద్ధ ముచ్మః.

మహాత్ముడైన శాలాతురీయునిచే సమర్థములగు సమాసము లన్నియు నిర్ణీతములైనవి. అట్లే వానియందుపయోగింపబడునవియు విహితములైనవి. ఇక జ్ఞాపకసిద్ధమైన అసమర్థసమాసమును వివరింతుము.

అసమర్థసమాసః

శ్లో. తను ముద్ధూళయన్ మర్త్యః శివభాగవతో యది,
అరిషడ్వర్గ తస్తస్య భయం నాస్తి కదాచన.

మనుష్యుడు శరీరము నిండుగ భస్మము పూసికొని శివభాగవతుడైనచో అతని కెన్నడును అరిషడ్వర్గమువలన భయముండదు.

భగవతి భక్తః-భాగవతః; శివే భాగవతః - శివభాగవతః; షణ్ణాం వర్గః షడ్వర్గః; అరీణాం షడ్వర్గః-అరిషడ్వర్గః; సూర్యం న పశ్యంతీ త్యసూర్యం పశ్యాః-ఇత్యేవమాదయః.

ఉదా : భగవంతుని విషయమున భక్తుడు భాగవతుడు, శివుని విషయమున భాగవతుడు శివభాగవతుడు; షట్టులవర్గము షడ్వర్గము; అరులషడ్వర్గము అరిషడ్వర్గము; సూర్యుని చూచుచుండనివారు అసూర్యంపశ్యులు - మున్నగునవి.

శ్లో. ప్రాయికమేషాం కథితం ప్రాధాన్యం చాతిమాలాదౌ,
దన్తోష్ఠే ద్విత్రాదౌ నైతత్సాపప్రతీత్యాదౌ.

ప్రాయికముగా వీనికి అతిమాలాదులందు ప్రాధాన్యము కలదు. దన్తోష్ఠము, ద్విత్రములు, సూపప్రతి - మున్నగువానియందు ప్రాధాన్యము లేదు.

మాలా మతిక్రాన్తః - అతిమాలః; దన్తశ్చ ఓష్ఠశ్చ తయోః సమాహారః - దన్తోష్ఠమ్; ద్వౌ వా త్రయోవా - ద్విత్రాః; సూపస్య లేశః - సూపప్రతి.

ఉదా : మాలను అతిక్రమించినవాడు అతిమాలుడు. దంతము యొక్కయు, ఓష్ఠముయొక్కయు సమాహారము దన్తోష్ఠము. ద్విగాని, త్రయముగాని ద్విత్రములు. సూపముయొక్క లేశము సూపప్రతి.

## కృదాదివృత్తయః

శ్లో. కృత్తద్ధిత సనాద్యన్త ధాతుభ్య శ్త్వైక శేషతః,
సమాసాదపి విద్వద్భిః కథితాః పఞ్చ వృత్తయః.

కృద్వృత్తి, తద్ధితవృత్తి, సనాద్యన్తధాతువృత్తి, ఏకశేషవృత్తి, సమాసవృత్తి - అని వృత్తులైదువిధములని విద్వాంసులు చెప్పిరి.

## 1. కృద్వృత్తిః

శ్లో. భక్తానా మపి మర్త్యానా మమరాణా మథాపి వా,
సంపాదయతి యాజ్ఞానం తాం వాచం ప్రణమామ్యహమ్.

భక్తులైన మర్త్యులకుగాని, అమరులకుగాని యేది జ్ఞానమును కల్గించునో, అట్టివాక్కునకు నేను నమస్కరింతును.

భజన్త ఇతి - భక్తాః; మ్రియన్త ఇతి మర్త్యాః; న మ్రియన్త ఇతి-అమరాః; జ్ఞాయతేఽనేనేతి - జ్ఞానమ్; ఉచ్యత ఇతి-వాక్.

ఉదా : భజించువారు భక్తులు. మరణించువారు మర్త్యులు. మరణింపని వారు అమరులు. దేనిచే తెలిసికొనబడునో అది జ్ఞానము. వచింపబడునది వాక్కు.

## 2. తద్ధితవృత్తిః

శ్లో. మానుషా నాదితేయాన్వా పీడయన్తో భువి స్థితాః,
యే దైతేయా స్తాన్నిహన్తుం జాతో దాశరథిః స్వయమ్.

మానుషులను, అదితేయులను పీడించుచు భూమిపైనుండు దైతేయులను సంహరించుటకు దాశరథి స్వయముగా జన్మించెను.

మనో రపత్యాని పుమాంసో - మానుషాః; అదితే రపత్యాని పుమాంసః-ఆదితేయాః; దితే రపత్యాని పుమాంసో-దైతేయాః; దశరథ స్యాపత్యం పుమాన్-దాశరథిః; పులస్త్యస్య గోత్రాపత్యం పుమాన్-పౌలస్త్యః ఇత్యేవమాదయః.

ఉదా : మనువుయొక్క అపత్యములైన పురుషులు మానుషులు. అదితియొక్క అపత్యములైన పురుషులు ఆదితేయులు. దితియొక్క అపత్యములైన పురుషులు దైతేయులు. దశరథునియొక్క అపత్యమైన పురుషుడు దాశరథి. పులస్త్యునియొక్క గోత్రాపత్యమైన పురుషుడు పౌలస్త్యుడు మున్నగునవి.

## 3. సనాద్యన్తధాతువృత్తిః

శ్లో. యః పాస్పర్ధీతి వా లోకాన్ దేవైర్వైరాయతే సదా,
రాక్షసస్య వినాశాయ తస్య పుత్రీయతు ప్రభుః.

ఎవడు లోకములను మిక్కిలి స్పర్ధతో ఎదిరించునో, ఎల్లపుడును దేవతలతో విరోధించునో, ఆ రాక్షసుని వినాశమునకై ప్రభువు పుత్రుని పొందుటకు కోరునుగాక !

అతిశయేన స్పర్ధతే-పాస్పర్ధీతి; వైరమాచరతి-వైరాయతే; పుత్త్రి మాత్మన ఇచ్ఛతు - పుత్త్రీయతు ఇత్యేవమాదయాః.

ఉదా : అతిశయముగా స్పర్ధించుచున్నాడు-పాస్పర్ధీతి. విరోధించుచున్నాడు-వైరాయతే. తనకు పుత్రుని కోరుకొనుగాక-పుత్త్రీయతు-మున్నగునవి. ఇవియన్నియు క్రియలు.

## 4. ఏకశేషవృత్తిః

శ్లో. సర్వేషామపి లోకానాం పితరౌ యౌ సనాతనౌ,
విదితౌ పాలనాచ్చిత్తే తౌ శివౌ సతతం భజే.

సనాతనులగు ఎవ్వరు, పరిపాలనమువలన సమస్తలోకములకును పితరులుగా విదితులగుచున్నారో, ఆ శివులను నా మనస్సునం దెల్లప్పుడును సేవింతును.

మాతా చ పితా చ-పితరౌ; సనాతనీ చ సనాతనశ్చ - సనాతనౌ; విదితా చ విదితశ్చ-విదితౌ; సాచ స చ - తౌ; శివా చ శివ శ్చ-శివౌ.

ఉదా : మాతయును, పితయును పితరులు, సనాతనియు, సనాతనుడును సనాతనులు. విదితయు, విదితుడును విదితులు, ఆమెయు, అతడును వారు, శివయును, శివుడును శివులు.

## 5. సమాసవృత్తిః

శ్లో. సమాసవృత్తి స్సర్వేషు సమాసేషు నిరూపితా,
పరార్థస్యాభిధానం హి వృత్తి రిత్యభిధీయతే.

సమాసములన్నింటియందును సమాసవృత్తి నిరూపింపబడినది. పరార్థముయొక్క అభిధానమే వృత్తియని చెప్పబడును.

శ్లో. భో భో మాత్సర్యముత్సార్య వాత్సల్యాన్మత్కృతామిమామ్,
పశ్యన్తు విబుధాః సర్వే సమాసకుసుమావళిమ్.

ఓహో విద్వాంసులారా ! మీరందరును మాత్సర్యమును విడిచి, నేను రచించిన యీ సమాసకుసుమావళిని వాత్సల్యముతో పరికింతురు గాక !

శ్లో. శ్రీ మధ్యమన్దిర కులామ్బుధి పూర్ణచన్ద్ర
శ్రీ సర్వమఙ్గళ మనీషికృతా సలీలమ్,
ఏషా సమాసకుసుమావళి రాబ్జతారం
జీయాత్కృపానిధి సదాశివ సంప్రసాదాత్.

సమాస కుసుమావళిః సమాప్తాః

శ్రీ మధ్యమన్దిర (నడిమింటి) వంశమనెడు సముద్రమునకు పూర్ణచంద్రుడైన శ్రీసర్వమంగళ విద్వాంసుడు విలాసముగా కూర్చిన యీ సమాసకుసుమావళి, కృపానిధియగు శ్రీ సదాశివుని యనుగ్రహముువలన ఆచంద్రతారకము జీవించునుగాక !

సమాసకుసుమావళి ముగిసెను.

---

# ధాతవః
## (ధాతువులు)

సంస్కృతభాషయందలి తిజంతపదములు క్రియలు అనబడును. క్రియలకు మూలరూపములు ధాతువులు. ప్రత్యయములు చేరునప్పుడు ధాతువులు పొందు మార్పులనుబట్టి అవి పది గణములుగా విభజింప బడినవి-భ్వాది, అదాది, జుహోత్యాది, దివాది, స్వాది, తుదాది, రుధాది, తనాది, క్ర్యాది, చురాది-ఇవి పది గణములు.

ధాతువులపైన వచ్చు లకారములు పది-లట్, లిట్, లుట్, లృట్, లేట్, లోట్, లఙ్, లిఙ్, లుఙ్, లృఙ్. వీనిలో లేట్ వేదమునందు మాత్రమే ప్రయోగింపబడును.

లట్ వర్తమానమును, లిట్, లఙ్, లుఙ్ లు భూతకాలమును, లోట్, లిఙ్ లు విధిని, ఆశీస్సును, లుట్, లృట్, లృఙ్ లు భవిష్యత్కాలమును తెలుపును. లిఙ్ మాత్రము ఆశీర్లిఙ్, విధిలిఙ్ అని రెండు విధములుగా ఉండును.

ఈ శ్లోకము కంఠస్థము చేయవలెను-

శ్లో. లడ్వర్తమానే లేద్వేదే, భూతే లఙ్ లుఙ్ లిటస్తథా
విధ్యాశిషోస్తు లిఙ్ లోటౌ, లృఙ్ లృట్ లుట్చ భవిష్యతి.

పదిలకారములందును ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుష భేదములును, ప్రతి పురుషమున ఏక, ద్వి, బహువచన భేదములును కలవు. ఈ భేదములు కొన్ని ప్రత్యయములు చేరుటవలన ఏర్పడును.

ధాతువులపై లకార స్థానమునచేరు ప్రత్యయములు పరస్మైపదములు, ఆత్మనేపదములు అని రెండు విధములు. పరస్మైపద ప్రత్యయములు చేరు ధాతువులు పరస్మైపదులు, ఆత్మనేపద ప్రత్యయములు చేరు ధాతువులు ఆత్మనేపదులు. కొన్ని ధాతువులపై పరస్మైపద ప్రత్యయములుగాని, ఆత్మనేపద ప్రత్యయములుగాని చేర్చవచ్చును. అట్టి ధాతువులు ఉభయపదులు అనబడును.

తిఙ్ ప్రత్యయములు పదునెనిమిది. అందు తొమ్మిది పరస్మైపదములు, తొమ్మిది ఆత్మనేపదములు.

పరస్మైపదములు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్రథమ పురుషము | తిప్ | తస్ | ఝి |
| మధ్యమ పురుషము | సిప్ | థస్ | థ |
| ఉత్తమ పురుషము | మిప్ | వస్ | మస్ |

### ఆత్మనే పదములు

| | ఏక. | ద్వి. | బహు. |
|---|---|---|---|
| ప్రథమ పురుషము | త | ఆతామ్ | ఝ |
| మధ్యమ పురుషము | థాస్ | ఆథామ్ | ధ్వమ్ |
| ఉత్తమ పురుషము | ఇట్ | వహి | మహిఙ్ |

'తిప్' లోని తి మొదలు 'మహిఙ్' లోని ఙ్ వరకుగల ప్రత్యయములకు 'తిఙ్' అని పేరు. ఇవి అంతమందుగల పదములు తిఙంతములు.

పరస్మైపది, ఆత్మనే పది, ఉభయ పది ధాతువులకు ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుషములందు, ఏక, ద్వి బహువచన రూపములు ఉదాహరింపబడుచున్నవి.

### పరస్మైపదీ

### భూ సత్తాయామ్ — భూ = ఉండుట

### వర్తమానే లట్ — వర్తమాన కాలము

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర. | భవతి | భవతః | భవన్తి |
| మ. | భవసి | భవథః | భవథ |
| ఉ. | భవామి | భవావః | భవామః |

### భూతానద్యతన పరోక్షే లిట్.

### అనద్యతనపరోక్ష భూతకాలము

| | | |
|---|---|---|
| బభూవ | బభూవతుః | బభూవుః |
| బభూవిథ | బభూవథుః | బభూవ |
| బభూవ | బభూవివ | బభూవిమ |

## అనద్యతన భవిష్యతి లుట్

### అనద్యతన భవిష్యత్కాలము

| | | |
|---|---|---|
| భవితా | భవితారౌ | భవితారః |
| భవితాసి | భవితాస్థః | భవితాస్థ |
| భవితాస్మి | భవితాస్వః | భవితాస్మః |

### భవిష్యతి ఌట్ - భవిష్యత్కాలము

| | | |
|---|---|---|
| భవిష్యతి | భవిష్యతః | భవిష్యన్తి |
| భవిష్యసి | భవిష్యథః | భవిష్యథ |
| భవిష్యామి | భవిష్యావః | భవిష్యామః |

### విధ్యాద్యాశీష్షు లోట్ - విధి, ఆశీస్సులు.

| | | |
|---|---|---|
| భవతు / భవతాత్ | భవతామ్ | భవన్తు |
| భవ / భవతాత్ | భవతమ్ | భవత |
| భవాని | భవావ | భవామ |

### అనద్యతన భూతే లఙ్ - భూతకాలము

| | | |
|---|---|---|
| అభవత్ | అభవతామ్ | అభవన్ |
| అభవః | అభవతమ్ | అభవత |
| అభవమ్ | అభవావ | అభవామ |

### విధ్యాదిషు లిఙ్ - విధి, మున్నగునవి

| | | |
|---|---|---|
| భవేత్ | భవేతామ్ | భవేయుః |
| భవేః | భవేతం | భవేత |
| భవేయమ్ | భవేవ | భవేమ |

### ఆశిషి లిఙ్ - ఆశీర్వాదము

| | | |
|---|---|---|
| భూయాత్ | భూయాస్తామ్ | భూయాసుః |
| భూయాః | భూయాస్తమ్ | భూయాస్త |
| భూయాసమ్ | భూయాస్వ | భూయాస్మ |

### భూతే లుఙ్ - భూతకాలము

| | | |
|---|---|---|
| అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| అభూః | అభూతమ్ | అభూత |
| అభూవమ్ | అభూవ | అభూమ |

### లిఙ్నిమిత్తే క్రియాతిపత్తౌ లృఙ్ - భవిష్యత్కాలము

| | | |
|---|---|---|
| అభవిష్యత్ | అభవిష్యతామ్ | అభవిష్యన్ |
| అభవిష్యః | అభవిష్యతమ్ | అభవిష్యత |
| అభవిష్యమ్ | అభవిష్యావ | అభవిష్యామ |

## ఆత్మనేపదీ.

### ఏధవృద్ధౌ-ఏధ=వర్ధిల్లుట

### వర్తమానే లట్ - వర్తమానకాలము

| | | |
|---|---|---|
| ఏధతే | ఏధేతే | ఏధన్తే |
| ఏధసే | ఏధేథే | ఏధధ్వే |
| ఏధే | ఏధావహే | ఏధామహే |

భూతానద్యతన పరోక్షే లిట్ - భూతకాలము

| | | |
|---|---|---|
| పధాఞ్చక్రే | పధాఞ్చక్రాతే | పధాఞ్చక్రిరే |
| పధాఞ్చకృషే | పధాఞ్చక్రాథే | పధాఞ్చకృఢ్వే |
| పధాఞ్చక్రే | పధాఞ్చకృవహే | పధాఞ్చకృమహే |
| పధామ్బభూవ | పధామ్బభూవతుః | పధామ్బభూవుః |
| పధామ్బభూవిథ | పధామ్బభూవథుః | పధామ్బభూవ |
| పధామ్బభూవ | పధామ్బభూవివ | పధామ్బభూవిమ |
| పధామాస | పధామాసతుః | పధామాసుః |
| పధామాసిథ | పధామాసథుః | పధామాస |
| పధామాస | పధామాసివ | పధామాసిమ |

అనద్యతన భవిష్యతి లుట్ - భవిష్యత్కాలము

| | | |
|---|---|---|
| పధితా | పధితారౌ | పధితారః |
| పధితాసే | పధితాసాథే | పధితాధ్వే |
| పధితాహే | పధితాస్వహే | పధితాస్మహే |

భవిష్యతి లృట్ - భవిష్యత్కాలము

| | | |
|---|---|---|
| పధిష్యతే | పధిష్యేతే | పధిష్యన్తే |
| పధిష్యసే | పధిష్యేథే | పధిష్యధ్వే |
| పధిష్యే | పధిష్యావహే | పధిష్యామహే |

### విధ్యాద్యాశీష్షు లోట్ - విధి, ఆశీస్సు

| | | |
|---|---|---|
| ఏధతామ్ | ఏధేతామ్ | ఏధన్తామ్ |
| ఏధస్వ | ఏధేథామ్ | ఏధధ్వమ్ |
| ఏధై | ఏధావహై | ఏధామహై |

### అనద్యతన భూతే లఙ్ - భూతకాలము

| | | |
|---|---|---|
| ఐధత | ఐధేతామ్ | ఐధన్త |
| ఐధథాః | ఐధేథామ్ | ఐధధ్వమ్ |
| ఐధే | ఐధావహి | ఐధామహి |

### విధ్యాదిషు లిఙ్ - విధి, మున్నగునవి

| | | |
|---|---|---|
| ఏధేత | ఏధేయాతామ్ | ఏధేరన్ |
| ఏధేథాః | ఏధేయాథామ్ | ఏధేధ్వమ్ |
| ఏధేయ | ఏధేవహి | ఏధేమహి |

### ఆశిషి లిఙ్ - ఆశీర్వాదము

| | | |
|---|---|---|
| ఏధిషీష్ట | ఏధిషీయాస్తామ్ | ఏధిషీరన్ |
| ఏధిషీష్ఠాః | ఏధిషీయాస్థామ్ | ఏధిషీధ్వమ్ |
| ఏధిషీయ | ఏధిషీవహి | ఏధిషీమహి |

### భూతే లుఙ్ - భూతకాలము

| | | |
|---|---|---|
| ఐధిష్ట | ఐధిషాతామ్ | ఐధిషత |
| ఐధిష్ఠాః | ఐధిషాథామ్ | ఐధిఢ్వమ్ / ఐధిధ్వమ్ |
| ఐధిషి | ఐధిష్వహి | ఐధిష్మహి |

లిఙ్నిమిత్తే క్రియాతిపత్తౌ లృఙ్ - భవిష్యత్కాలము

| | | |
|---|---|---|
| ఐధిష్యత | ఐధిష్యేతామ్ | ఐధిష్యన్త |
| ఐధిష్యథాః | ఐధిష్యేథామ్ | ఐధిష్యధ్వమ్ |
| ఐధిష్యే | ఐధిష్యావహి | ఐధిష్యామహి |

*ఉభయపదీ*

రాజృ దీప్తౌ - రాజ్ = ప్రకాశించుట

లటి

పరస్మై. రాజతి ఇత్యాది - ఆత్మనే. రాజతే ఇత్యాది.

లిటి

పరస్మైపదప్రత్యయేషు

| | | |
|---|---|---|
| రరాజ | రరాజతుః / రేజతుః | రరాజుః / రేజుః |
| రరాజిథ / రేజిథ | రరాజథుః / రేజథుః | రరాజ / రేజ |
| రరాజ | రరాజివ / రేజివ | రరాజిమ / రేజిమ |

ఆత్మనేపదప్రత్యయేషు

| | | |
|---|---|---|
| రేజే | రేజాతే | రేజిరే |

ఇత్యాది.

లుటి మధ్యమే—రాజితాసి—రాజితాసే, ల్రుటి—రాజిష్యతి—రాజిష్యతే, లోటి—రాజతు—రాజతామ్, లఙి—అరాజత్—అరాజత, విధిలిఙి—రాజేత్—రాజేత, ఆశీర్లిఙి—రాజ్యాత్—రాజిషీష్ట, లుఙి—అరాజీత్—అరాజిష్ట, ల్రుఙి—అరాజిష్యత్—అరాజిష్యత.

ఇత్యేవం బాలానాం ధాతుస్వరూపసరణిః ప్రదర్శితేతి విద్వచ్ఛిఖామణయో విదాంకుర్వన్తు.

ఈ విధముగా బాలురకయి ధాతు స్వరూపపద్ధతి చూపబడినదని విద్వచ్ఛిఖామణులు తెలిసికొందురుగాక !

—

శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ రామాయణ సఙ్గ్రహః

శ్లో. జ్ఞానానన్దమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

## శ్రీ రామాయణ సంగ్రహము

తా. జ్ఞానానందమయుడు, నిర్మలమైన స్ఫటికమువంటి ఆకృతి గలవాడు, సర్వవిద్యలకు ఆధారమైనవాడునైన హయగ్రీవ దేవుని ఉపాసింతుము.

## బాలకాణ్డః

శ్రీ సీతారామపాదబ్జా న్యభివాద్య తనోమ్యహం,
సుఖబోధాయ బాలానాం శ్రీరామాయణసఙ్గ్రహమ్. 1

## బాలకాండము

శ్రీసీతారాముల పాదపద్మములకు నమస్కరించి బాలుర సుఖబోధకొఱకై శ్రీరామాయణ సంగ్రహము రచింతును.

ప. ఆసీ దయోధ్యా నగరీ దేశే కోసలనామని,
తస్యాం శ్లాఘ్యగుణః శ్రీమాన్ రాజా దశరథోఽవసత్. 2

కోసలమను పేరుగల దేశమున అయోధ్యయను నగరముండెను. అందు కొనియాడదగిన గుణములు గలవాడు, శ్రీమంతుడునైన దశరథుడను రాజు నివసించుచుండెను.

గ. తస్య కౌసల్యేతి సుమిత్రేతి కైకేయీతి చ తిస్రో భార్యా బభూవుః. తాసు. 3

అతనికి కౌసల్యయని, సుమిత్రయని, కైకేయి యని ముప్పురు భార్యలుండిరి. వారిలో—

ప. కౌసల్యా సుషువే రామ మభిరామగుణాకరం,
శ్రీ రామభక్తి భరితం భరతం కేకయాత్మజా. 4

కౌసల్య అభిరామ గుణాకరుడైన రాముని ప్రసవించెను. కైకేయి శ్రీరామభక్తి భరితుడైన భరతుని ప్రసవించెను.

ప. అథ లక్ష్మణశత్రుఘ్నౌ ప్రాసూయేతాం సుమిత్రయా,
ఏతే కుమారా శ్చత్వారో వ్యవర్ధన్త దినేదినే. 5

సుమిత్ర లక్ష్మణ శత్రుఘ్నులను ప్రసవించెను. ఈ నలుగురు కుమారులు దినదినము వర్ధిల్లుచుండిరి.

గ. దశరథస్తు చౌలోపనయనాదీ న్యథాకాలం విధాయ విధివ దధీత నిఖిలవిద్యా నుపాధ్యాయై రకారయత్. కదాచి దథ యాతుధాన విధ్వంస్యమానసత్రపరిత్రాణాయ విశ్వామిత్రనామా ముని రుపగమ్య దశరథ మయాచత రామం స లక్ష్మణమ్. 6

దశరథుడును యథాకాలమున చౌలోపనయనాదులను చేయించి. యుపాధ్యాయులచే విధివంతముగా అఖిల విద్యలు నేర్పించెను, అంతట నొకప్పుడు రాక్షసులు ధ్వంసము చేయుచుండిన యాగమును రక్షించుటకై విశ్వామిత్రుడను ముని దశరథుని చేరవచ్చి లక్ష్మణ సహితుడైన రాముని పంపుమని ప్రార్థించెను.

ప. ప్రాహిణో న్మునిసంత్రాసా త్ప్రియావపి సుతౌ నృపః,
స రాజపుత్రా వనయ దటవీం కథయన్ కథాః. 7

ముని పట్లగల భయమువలన రాజు ప్రియులైన సుతుల నిరువురను పంపెను. ఆయనయు కథలు చెప్పుచు రాజపుత్రులను అడవికి దీసికొనిపోయెను.

ప. సత్యప్యరణ్య సఞ్చారే శ్రమస్యానుదయాయ సః,
ఉపాదిశ త్తయోర్విద్యే బలా మతిబలామపి. 8

అరణ్యములందు సంచరించుచుండినను శ్రమ కలుగకుండుటకై ఆ ముని యా యిరువురకు బల, అతిబల యను రెండు విద్యలను ఉపదేశించెను.

గ. వనమధ్యే గచ్ఛతా మేతేషాం పదవీం తాటకానామ రాక్షసీ రురోధ. స్త్రియమపి జగదపకారిణీం తాం ధాశరథి ర్గాధి తనయానుమత్యా వ్యాపాదయామాస. 9

అరణ్య మధ్యమున బోవుచున్న వీరి మార్గమును తాటకయను రాక్షసి యడ్డగించెను. స్త్రీ యైనను లోకాపకారిణియైన ఆ తాటకను దాశరథి విశ్వామిత్రుని యనుమతితో సంహరించెను.

ప. అస్త్రాణి జృమ్భకాదీని తపస్వీ చ తయో స్తతః,
ఉపదిశ్య ప్రవిశ్య స్వమాశ్రమం కుర్వతి క్రతుమ్. 10

అంతట ఆ తపస్వి జృంభకాదులైన యస్త్రములను వారికి ఉపదేశించి, తన యాశ్రమము ప్రవేశించి యాగము చేయుచుండగా—

ప. శూరౌ సుబాహుమారీచౌ శైలశోణితవర్షిభిః,
రక్షోభి స్సహ సంక్షోభం చక్రతు స్తాటకాసుతౌ. 11

తాటకా సుతులైన మారీచ సుబాహులను ఇరువురు శూరులు శైలములను శోణితమును వర్షించుచున్న రాక్షసులతోగూడి సంక్షోభము కలిగించిరి.

గ. దశరథాత్మజస్తు మాతరిశ్వాస్త్రేణ మారీచ మపాంపతౌ నిపాత్య సుబాహుప్రముఖకోణపవర్గ మేకేనైవ బాణేన లీలయైవ సూదయామాస. విశ్వామిత్రస్తు నిరంతరాయం పరిసమాప్య స ప్తతంతుం రఘుసుతాయ జనక సుతాం దిదాపయిషు ర్మిథిలాం ప్రతి ప్రతస్థే. 12

దశరథ పుత్రుడును వాయవ్యాస్త్రముచే మారీచుని సముద్రమున బడవైచి సుబాహువు మున్నగు రాక్షస సమూహమును ఒకే బాణముతో తేలికగా చంపివైచెను. విశ్వామిత్రుడును యాగమును నిర్విఘ్నముగా ముగించి శ్రీరామునకు జానకిని ఇప్పింపగోరి మిథిలను గూర్చి బయలుదేరెను.

ప. రామపాద రజస్సంగా త్ప్రకృతిం గతయా పథి,
అహల్యయా గౌతమస్య జాయయాఽయమపూజ్యత. 13

మార్గమున రామపాదధూళి సంపర్కమువలన నిజరూపము పొందిన గౌతమపత్నియైన యహల్యచే విశ్వామిత్రుడు పూజింపబడెను.

గ. తదను మిథిలాం ప్రవిశ్య పరిగృహీతాతిథ్యే కౌశికే నిజాగమనకారణ మావేదయతి జనకేన ప్రదర్శితం శివశరాసనం దశరథాత్మజో బభంజ. 14

తరువాత మిథిలను ప్రవేశించి, ఆతిథ్యము పరిగ్రహించి నిజాగమన కారణమును తెలిపిన విశ్వామిత్రునకు జనకుడు చూపిన శివశరాసనమును శ్రీరాముడు భగ్నము చేసెను.

ప. జాతానందస్తు జనకో దూతై స్త్వరితగామిభిః,
ఆహ్వాపయద్దశరథం సకుటుంబపురోధసమ్. 15

ఆనందము కలిగిన జనకుడును శీఘ్రగాములైన దూతలచే కుటుంబ పురోహిత సహితముగా దశరథుని పిలిపించెను.

ప. అథోత్తమే ముహూర్తే స రామాయ ధరణీసుతామ్,
సీతా మదాదాత్మసుతా మూర్మిళాం లక్ష్మణాయ చ. 16

అంతట మేలైన ముహూర్తమున జనకుడు ధరణీసుతయైన సీతను రామునకును, నిజసుతయైన ఊర్మిళను లక్ష్మణునకును ఇచ్చెను.

గ. అథ నిజానుజస్య కుశధ్వజస్య తనుజే మాండవీ శ్రుతకీర్తీ భరతశత్రుఘ్నాభ్యాం చ దత్వా శుభే ఽహని వివాహ మకరోత్. 17

అంతట తన తమ్ముడైన కుశధ్వజుని పుత్రికలైన మాండవీ శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నుల కిచ్చి శుభదినమున వివాహ మొన రించెను.

ప. అథానురూపజాయాభి రుపేతై స్తనయైస్సమం,
ప్రతస్థే కోసలపతి స్సాకేతనగరం నిజమ్. 18

పిదప అనురూపలైన భార్యలతో గూడిన తనయులతోపాటు దశరథుడు తన సాకేత నగరమునకు బయలుదేరెను.

ప. జిగీషయాఽఽగతం రామం భార్గవం రఘువంశజః,
రామో జిగాయ జయిన మాలిలిఙ్గ నృప స్సుతమ్. 19

జయించు కోరికతో వచ్చిన భార్గవరాముని రఘువంశజుడైన శ్రీరాముడు జయించెను. విజయియైన సుతుని దశరథుడు కౌగిలించు కొనెను.

ప. అథ ప్రవిశ్య నగరం సాకేతం రఘునందనః,
సీతయా రమమాణస్సన్ సమోమ్మదం సమవిన్దత. 20

ఇతి బాలకాణ్డః.

అంతట రఘునందనుడు నగరమును ప్రవేశించి, సీతతో క్రీడించుచున్నవాడై ఆనందము పొందెను.

ఇది బాలకాండము.

## అ యో ధ్యా కా ణ్డః

ప. తతో భరతశత్రుఘ్నౌ తాతాదేశేన జగ్మతుః,
యుధాజి దభిధానస్య మాతులస్య పురం ప్రతి. 1

అయోధ్యాకాండము

అనంతరము తండ్రి యాదేశమున భరతశత్రుఘ్నులు యుధాజిత్తు అను పేరుగల తమ మేనమామ నగరమునకు జనిరి.

ప. రామాభిషేచనం కర్తుం యతమానం మహీపతిమ్,
మంధరాకులితస్వాంతా కైకేయీ దుర్వచోఽబ్రవీత్. 2

శ్రీరామపట్టాభిషేకము గావించుటకు యత్నించుచుండిన రాజునకు మంధరచే కలుషితము చేయబడిన చిత్తముగలదై కైకేయి యిట్లు పరుషముగా పలికెను.

గ. యది త్వం సత్యసంగరోఽసి శమ్బరసంగరసముదీరితవరయుగళే ప్రథమస్య ఫలం రామస్య వనవాసం ద్వితీయస్య భరతాభిషేచనం చ విధేహి. నైనం యది విష ముపభుజ్య పశ్యత స్తవ ప్రాణాం స్త్యజామీతి. 3

"నీవు సత్యసంధుడవైనచో శంబర సమరమున వాగ్దానము చేసిన వరద్వయమునందు ఒకదానికి రాముని వనవాసము, రెండవ

దానికి భరత పట్టాభిషేకము ఫలముగా విధింపుము. ఇట్లు కానియెడల విషము తిని నీవు చూచు చుండగనే ప్రాణములు విడుతును."

ప. ఇదం పరుష మాకర్ణ్య మూర్ఛితో నృపతి ర్భువి,
పపాత వజ్ర నిర్భిన్నపక్షః పర్వతరాడివ. 4

ఈ కఠిన వచనము విని రాజు మూర్ఛితుడై వజ్రాయుధముచే నఱుకబడిన ఱెక్కలుగల పర్వతరాజువలె నేలగూలెను.

ప. అసత్యభీతో నృపతి శ్చిరేణ ప్రాప్య చేతనామ్,
కైకేయీం ప్రార్థయామాస రామస్య పురవర్తనమ్. 5

అసత్యభీతుడైన నరపతి చాల సేపటికి మూర్ఛదేరి రాముని పట్టణమందే యుండనిమ్మని కైకేయిని ప్రార్థించెను.

ప. బహుధా ప్రార్థ్యమానాపి సా ముమోచ న చాగ్రహం,
నిమమజ్జ మహీజాని రపారే శోకసాగరే. 6

పెక్కు విధముల ప్రార్థింపబడినదయ్యు ఆమె తన పట్టు విడువదయ్యెను. మహీపతి యపారమైన శోకసాగరమున మునిగిపోయెను.

ప. వనం గచ్ఛామి తాతేతి ప్రణమ్యాపృచ్ఛ్య రాఘవః,
సాకం సౌమిత్రిసీతాభ్యాం సమారుక్షద్రథం రథీ. 7

"తండ్రీ! వనమున కేగుచున్నాను" అని వీడ్కోలు పలికి రథియైన రాఘవుడు సీతాలక్ష్మణులతోగూడి రథ మారోహించెను.

ప. సర్వాననుగతాన్పౌరా న్వఞ్చయిత్వా వినిద్రితాన్,
శాద్వలేన పథా రాత్ర్యాం స జగామ సురాపగామ్. 8

తనవెంట వచ్చిన పౌరులెల్లరను నిద్రించుచుండగా వంచించి శాద్వల మార్గమున రాత్రివేళ రాముడు గంగానది కరిగెను.

గ. తత్ర నివసతా గుహాభిధేన వ్యాధేన సుహృదా సముత్తీర్య సురతరఙ్గిణీ మవాప్య చిత్రకూటగిరి మనుజవిరచిత వరివస్య స్సహ సీతయా చిర మరమత రఘువరః. తతః 9

అచ్చట నివసించుచున్న మిత్రుడగు గుహుడను పేరి వ్యాధునిచే సురతరంగిణినిదాటి, చిత్రకూటగిరినిచేరి, తమ్మునిసేవలందుచు సీతతో గలిసి రఘువరుడు చిరకాలము సుఖముండెను. అనంతరము—

ప. మహతా పుత్రశోకేన దివం దశరథో యయౌ,
దూతై ర్భరత మానిన్యు రమాత్యా ఆశుగామిభిః .10

గొప్పదైన పుత్రశోకముచే దశరథుడు స్వర్గమున కేగెను. శీఘ్రగాములైన దూతలచేత అమాత్యులు భరతుని రప్పించిరి.

గ. సచ సమాకర్ణ్య సకలాం ప్రవృత్తిం నిపత్య సంజ్ఞా విరహిత స్సర్వంసహాయా మవాప్య చిరాయ చేతనాం విరమ్య వసిష్ఠాదినిరోధేన కైకేయీ మన్థరామారణా ద్విధాయౌర్ధ్వ దైహికం దశరథాయ ప్రస్థాయ నిఖిలపౌరై స్సమముపేత్య చిత్రకూటాచల మవనిజాజానే శ్చరణారుణాంబుజయుగళే నిపపాత. 11

ఆతడును జరిగిన దంతయు విని చేష్టలుడిగి నేలబడి, చాలా సేపటికి తెలివొంది. వసిష్ఠాదుల బలవంతముచే కైకేయీ మంథరలను చంపుటమాని, దశరథునకు అపరకర్మలు నిర్వర్తించి, సకల పౌరులతో గూడి బయలుదేరి, చిత్రకూట పర్వతమునుచేరి జానకీపతి చరణ పద్మయుగళమున వ్రాలెను.

ప. మృత మాకర్ణ్య పితరం శుచా దత్వా జలాఞ్జలిమ్,
పప్రచ్ఛ భరతం భద్రం పౌరాణాం పరమః పుమాన్. 12

తండ్రి మృతుఁడగుట విని శోకముతో జలాంజలి యర్పించి పురుషోత్తముడగు శ్రీరాముడు పౌరుల క్షేమమును గూర్చి భరతుని ప్రశ్నించెను.

ప. తత స్సపాదపతనం భరతేనార్థితోఽపి సః,
స జగామ పురం రామ స్తాతాదేశ మనుస్మరన్. 13

తరువాత భరతునిచే పాదములబడి వేడుకొనబడిన వాఁడయ్యు తండ్రి యాదేశమును స్మరించి శ్రీరాముడు నగరమునకు వెడలఁడయ్యెను.

చ. అనంతర మగ్రజాదేశే నాయోధ్యా ముపేత్య భరతో నందిగ్రామే రఘునన్దనవజ్జటావల్కలధారీ సన్ సింహాసన ప్రతిష్ఠాపితాభ్యాం రామపాదుకాభ్యాం రాజ్యకార్యాణి విజ్ఞాపయన్ రామాగమనదివసాన్ గణయన్నువాస. 14

అనంతరము అగ్రజాదేశమున అయోధ్యనుచేరి, భరతుడు రామునివలె జటావల్కలధారియై సింహాసనమున ప్రతిష్ఠింపబడిన రామపాదుకలకు రాజ్యకార్యములను విన్నవించుచు, రామాగమన దినములను లెక్కించుకొనుచు నందిగ్రామమున నివసించెను.

ప. రఘువంశ పయోరాశి శీతాంశు రథ రాఘవః,
ఆశ్రమాదాశ్రమం గచ్ఛ న్ప్రావిశ ద్దణ్డకావనమ్. 15

ఇత్యయోధ్యాకాణ్డః

అంతట రఘువంశమనెడు పాలసముద్రమునకు చంద్రుడైన రాఘవుడు ఆశ్రమమునుండి యాశ్రమమునకు బోవుచు క్రమముగా ధండకారణ్యము ప్రవేశించెను.

ఇది అయోధ్యాకాండము.

## ఆ ర ణ్యా కా ణ్డః

ప. విరాధ మసురం శ్వభ్రే నిఖనన్ దణ్డకాం విశన్,
శరభఙ్గమునిం రామో నత్వాగస్త్య ముపాగమత్. 1

### అరణ్యకాండము

విరాధుడను రాక్షసుని రంధ్రమున పూడ్చిపెట్టి, దండకను ప్రవేశించి రాముడు శరభంగమునికి మ్రొక్కి అగస్త్యుని కడకేగెను.

ప. తద్దత్తానీంద్రచాపాదీ న్యాదాయ సహసీతయా,
పంచవట్యాం చిరం రామో రేమేఽనుజకృతోటజే. 2

ఆ యగస్త్యు డిచ్చిన యింద్రచాపాదులను దీసికొని రాముడు పంచవటియందు తమ్ముడు నిర్మించిన పర్ణశాలయందు సీతతోగూడి చిరకాలము సుఖముండెను.

గ. తత్ర కదాచన హేమంతసమయే రావణానుజా శూర్పణఖాభిధా యాతుధానీ సౌందర్యసలిలశరధిం దాశరథిం నిరీక్ష్య 'భర్తా మమ భవాన్ భవ'త్వితి నిర్బబంధ. 3

అచ్చట హేమంత ఋతువునం దొకనాడు రావణుని చెల్లెలు శూర్పణఖ యను పేరుగల రాక్షసి సౌందర్యజల సాగరుడైన శ్రీరాముని గాంచి "నీవు నాకు భర్తవు కమ్ము" అని నిర్బంధించెను.

ప. పరిగ్రహీతు మాత్మానం దాశరథ్యో రనిచ్ఛతోః,
సీతా మాహర్తుమిచ్ఛన్తీ సాభ్యధావన్నిశాచరీ. 4

తనను పరిగ్రహించుటకు దశరథ పుత్రులు అంగీకరింపనందున ఆ నిశాచరి సీత నపహరింపగోరి యామెపై కెగబడెను.

ప. ప్రజావతీం జిఘాంసత్యా స్తస్యాస్సౌమిత్రిరాత్మవాన్
ఛిత్వాఽఽకృష్య చ్ఛురికయా కర్ణనాస మభిద్రవత్. 5

ధైర్యవంతుడైన సౌమిత్రి వదినెను చంపనుంకించుచున్న యామె చెవులను ముక్కును లాగి కత్తితో తరిగి తరిమివైచెను.

గ. తదను పరిదేవనరవేణ కులగిరిగహ్వర నిద్రాణ కేసరిణ స్సముద్వేజయంతీ పలాయ్య జనస్థానం ప్రతి తత్ర నివసంతి చతుర్దశ సహస్రాణి యాతూణి తదధిపతీం శ్చ ఖర దూషణ త్రిశిరసో దశకంధరబంధూ న్రఘుధురంధర నిరాకరణాయ నిర్యాపయతిస్మ. 6

తదనంతరము రోదన ధ్వనిచేత కులపర్వతగుహాలందు నిద్రించుచున్న సింహములను మేల్కొలుపుచున్నదై జనస్థానము దిక్కునకు పారిపోయి యచ్చట నివసించుచున్న పదునాలుగు వేల రాక్షసులను, వారి నాయకులను, ఖర దూషణ త్రిశిరు లను రావణ బంధువులను రఘువీరుని పరాభవించుటకై బయలుదేర దీసెను.

ప. ఆయాంత మసురానీక మాలోక్యావనిజాపతిః,
ఆదిశ్య లక్ష్మణం సీతా రక్షణే సధనుర్యయౌ. 7

వచ్చుచున్న రాక్షస సమూహమునుగాంచి జానకీ విభుడు సీతా సంరక్షణమున లక్ష్మణుని నియోగించి ధనుర్ధరుడై బయలుదేరెను.

ప. రామ స్తతో రాక్షసవీరవాహినీం
వినాశయామాస శరౌఘవృష్టిభిః,
జేతార మాయాంత మవేక్ష్య జానకీ
సమాశ్లిష త్సత్వర మాత్మవల్లభమ్. 8

అంత రాముడు రాక్షస వీరుల సేనను బాణసమూహ వర్షములచే నశింపజేసెను. విజేతయై వచ్చుచున్న నిజవల్లభునిగాంచి జానకి సత్వరముగా కౌగిలించుకొనెను.

గ. తదను జనస్థానే విజనస్థానే సతి లంకాం ప్రతి ప్రధావ్య సదసి నిపత్య చిరం విలప్య నివేదితోదంతాం వికృతముఖీం శూర్పణఖాం దశముఖో విలోక్య పటపటా కృత్య దంతాన్ సువర్ణహారిణవర్ష్మధారి మారీచ సహాయః పరివ్రాజకభూమికాచ్ఛాదితో రఘుశార్దూల పర్ణశాలభ్యర్ణమాజగామ. 9

అటుతరువాత జనస్థానము నిర్జన ప్రదేశము కాగా లంక దిక్కునకు బరువెత్తి, కొలువునబడి, చాల సేపు విలపించి యునంతము నివేదించిన వికృతవదనయైన శూర్పణఖనుగాంచి దశముఖుడు పండ్లు పటపటలాడించి, బంగరులేడి రూపను ధరించిన మారీచుడు తోడుగా పరివ్రాజక వేషమునుదాల్చి రఘుశార్దూలుని పర్ణశాల సమీపమున కరిగెను.

ప ఘూసాన్ ఘసంతం హారిణం సౌవర్ణం ప్రేక్ష్య మైథిలీ,
'ఆనీయ దేహి నా'థేతి ప్రేషయత్ ప్రాణవల్లభమ్. 10

గడ్డిపరకలు మేయుచున్న బంగరు లేడినిగాంచి మైథిలి "నాథా తెచ్చియిమ్ము" అని ప్రాణవల్లభుని పంపెను.

ప. దూరం గతస్త మసురం క్రియయా విభావ్య
వివ్యాధ శాతవిశిఖేన రఘుప్రవీరః,
చుక్రోశ దాశరథివ త్సమృగో 'హతోఽస్మి
హా లక్ష్మణానుజ సఖే సఖి మైథి'లీతి. 11

రఘువీరుడు చాలదూరముపోయి చేష్టలనుబట్టి రాక్షసునిగా నూహించి నిశితవిశిఖముచే వానిని సంహరించెను. ఆ మృగముకూడ "అయ్యో! తమ్ముడా, సఖుడా! లక్ష్మణుడా! చెలీ! సీతా! చచ్చితిని" అని రామునివలె ఆక్రోశించెను.

గ. తే నా_ర్తనాదేన విపన్నపరిత్రాతారమపి తమా
పన్నం విజ్ఞాయ దేవరం ప్రేషితవతీం దశరథస్నుషాం దశ
వదనో బాహుభి ర్నిజరథమారోప్య తత్పక్షపాతేన యోద్ధు
మభియాతస్య జటాయుషః పక్షపాతం విధాయ లంకాం ప్రవి
శ్యాశోక వనికాయా మేనా మతిభయంకరరాక్షసీ పరివృతాం
స్థాపయాం బభూవ. 12

ఆ యా_ర్తనాదముచే విపన్నులను రక్షించువాడైన ఆ రాముని ఆపన్నునిగా దలంచి మరదిని పంపిన సీతను రావణుడు చేతులతో దన రథమునబెట్టి, ఆమె యందలి పక్షపాతముచే యుద్ధముచేయ నెదురైన జటాయువునకు పక్షముల పతనము కలిగించి, లంకను ప్రవేశించి, సీతను అతిభయంకర రాక్షస పరివృతను గావించి అశోకవనము నందుంచెను.

ప. అధ్వన్యాయాంత మనుజ మాలోక్యోద్విగ్నమానసః,
సీతా మపశ్యన్నుటజే వ్యలప ద్రాఘవ _స్తతః. 13

అంతట మార్గమున వచ్చుచున్న తమ్మునిగాంచి రాఘవుడు ఉద్విగ్నచిత్తుడై, పర్ణశాలయందు సీతనుగానక మిగుల విలపించెను.

ప. సీతాపతి ర్ధరణిజా మథ మార్గమాణ
శ్శీర్ణ ప్రతీక ముదితాసురరాజకృత్యం,
సంస్కృత్య గృధ్ర నృపతిం వికృతిం కబంధం
కృత్వా విదోష మమలామ్బు మవాప పంపామ్. 14

ఇత్యారణ్యకాణ్డః.

పిమ్మట భూసుతను వెదకుచు శ్రీరాముడు విరిగిన రెక్కలు గలిగి, రాక్షసరాజు చేసిన పనిని తెలిపిన గృధ్రరాజును అగ్నిలో సంస్క

రించి, పాపియైన కబంధుని గతదోషుని గావించి, నిర్మల జలమైన పంపాసరస్సును చేరెను.

ఇది అరణ్యకాండము.

## కిష్కిన్ధాకాణ్డః

ప. తతః కపిర్వాలిభయాన్నిలీన
స్సుగ్రీవనామా చిర మృశ్యమూకే,
కోదండతూణీరధరౌ కుమారౌ
దృష్ట్వా బిభాయాగ్రజ భృత్యమత్వా. 1

కిష్కింధాకాండము

తరువాత వాలి భయమువలన చిరకాలము ఋశ్యమూకమున దాగియున్న సుగ్రీవుడను పేరుగల వానరుడు చాపతూణీరములు ధరించిన రాజకుమారులనుగాంచి తన అగ్రజుని సేవకులని భయపడెను.

ప. చికీర్షురేతస్య హితం హనూమాన్
ధృత్వా పరివ్రాజక భూమికాం ద్రాక్,
గత్వా సమానీయ నరేంద్రపుత్రౌ
మైత్రీ మతానీత్ ప్లవగాధిపస్య. 2

సుగ్రీవునకు హితము చేయగోరిన హనుమంతుడు పరివ్రాజక వేషము ధరించి శీఘ్రముగాబోయి రాజకుమారులను తోడ్కొనివచ్చి వానర రాజునకు స్నేహము కూర్చెను.

గ. తతః పరమన్యోన్య వినివేదిత భూతపూర్వనిజకథౌ కపినరవరౌ పరస్పరవైరివధాయ విరచితసంగరౌ బభూవతుః. 3

అటు తరువాత జరిగినపోయిన తమ వృత్తాంతములను ఒకరి కొకరు తెలియపరచుకొని సుగ్రీవ రామచంద్రులు ఒండొరుల శత్రు నాశనముకొఱకు ప్రతిజ్ఞలు గావించుకొన్నవారైరి.

ప. సుగ్రీవ విస్రంభ కృతేన దుందుభే
శ్శరీరముత్సార్య పదాంగుళీనఖాత్,
సప్తాపిసాలా న్గిరినాగలోకా
న్బిభేద బాణేన బిడౌజసా సమః. 4

ఇంద్రసమానుడైన శ్రీరాముడు సుగ్రీవునకు విశ్వాసము కలిగించుటకై కాలిగోటితో దుందుభి శరీరమును మీటి, సప్తసాలములను, పర్వత నాగలోకములను ఒక్క బాణముతో భేదించెను.

ప. తతః ప్రతీతః కపిపార్థివోఽసా
వృభుతపుత్రేణ సమం వ్యయుధ్యత్,
భ్రాత్రో స్తయో ర్భేదమనాప్నువానో
బభూవ తూష్ణీం భరతాగ్రజన్మా. 5

అంతట నమ్మిక కుదిరిన సుగ్రీవుడు ఇంద్రపుత్రుడైన వాలితో యుద్ధమొనరించెను. ఆ యిరువురి సోదరులలో భేదము నెఱుంగజాలని వాడై భరతాగ్రజుడు మిన్నక యుండెను.

గ. అథ స రఘుకులతిలకో వాలి బలాసహిష్ణుతయా కాందిశీక మపత్రపావశా దవనతగ్రీవం సుగ్రీవం సుమమాలాలంకృతగ్రీవం విధాయ వధాయ వాలినో విధత్స్వాయోధనమితి పునర్న్యయూయుజత్. 6

అప్పుడు ఆ రఘుకుల తిలకుడు వాలి బలము సహింపలేమిచే దిక్కుతోచక సిగ్గువలన తలవంచుకొనియున్న సుగ్రీవుని సుమమాలా

లంకృత గ్రీవుని గావించి, 'వాలిని వధించుటకై యుద్ధమాడుము' అని మరల నియోగించెను.

ప. తథాకుర్వతి సుగ్రీవే తరుస్కంధతిరోహితః,
జఘాన రామో బాణేన వాలినం జయశాలినమ్. 7

సుగ్రీవు డట్లే చేయగా రాముడు వృక్షస్కంధము చాటు చేసికొని ఒక్క బాణముతో జయశాలియైన వాలిని కొట్టెను.

ప. తారా వలీముఖగణ స్తారేయ స్తరణేస్సుతః,
భర్తృ నేతృ పితృ భ్రాతృ దుఃఖేన వ్యలపచ్చిరమ్. 8

తారయు, వానరగణమును, అంగదుడును, సుగ్రీవుడును భర్తృ నేతృ పితృ భ్రాతృ దుఃఖముచే చాలసేపు విలపించిరి.

గ. తదను నిర్వర్తితసంగరో రఘుధురంధరః పురందరతనయ స్యౌర్ధ్వదైహికం కృతవంతం కపిపార్థివం త మభిషిచ్య రాజ్యే మాల్యవతి గిరౌ వతివాహయాంచకార వర్షాదివసాన్. తతో రాజ్య సౌఖ్యానుభవప్రమత్తం మర్కటపతిం సౌమిత్రి ర్భీషయిత్వా రామనికటం నినాయ. 9

అటుపిమ్మట ప్రతిజ్ఞ నిర్వర్తించిన రఘునందనుడు వాలికి పరలోకక్రియలు నిర్వర్తించిన సుగ్రీవుని రాజ్యమునం దభిషేకించి మాల్యవత్పర్వతమున వర్షాదినములను గడపెను. అంతట రాజ్యసౌఖ్యానుభవప్రమత్తుడైన సుగ్రీవుని లక్ష్మణుడు బెదరించి రాముని చెంతకు గొని వచ్చెను.

ప. సీతాం విచేతుం ప్లవగా న్సర్వా నాహూయ భానవః,
విధాయ మాస మవధిం ప్రాహైషీత్సకలా దిశః. 10

సుగ్రీవుడు సీతను వెదకుటకు సర్వవానరులను పిలిచి, ఒక నెల గడువుపెట్టి సకలదిక్కులకు పంపెను.

ప. హనుమజ్జాంబవ దంగద నీల
ప్రముఖా యామ్యాం దిశ మభియాంతాః,
ద్వాదశ యోజనపరిమిత మిరిణం
ప్రాప్య శ్రాంతాః ప్రయయు ర్విపినమ్. 11

హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, నీలుడు మున్నగు వారు దక్షిణ దిశకు బోయిరి. పండ్రెండు యోజనముల విస్తీర్ణముగల యెడారిని చేరి అలసి యొక అరణ్యమున కరిగిరి.

ప. తత స్స్వయంప్రభాగుహాం ప్రవిశ్య హేమపాదపాం
మధూపహారవిస్మృత స్వకార్యరీతయోఽభవన్,
గతేఽవధౌ కదాచన ప్లవంగమేన కేనచి
త్ప్రబోధితా విలేపు రుచ్చకై రమీ ప్లవంగమాః. 12

అటనుండి బంగరు వృక్షములుగల స్వయంప్రభా గుహ ప్రవేశించి, మధువు లాని తమ కార్యక్రమమును మఱచినవారైరి. గడవు దాటినమీద ఒకనాడొకానొక వానరునిచే ప్రబోధితులై యా వానరులు బిగ్గరగా విలపించిరి.

గ. అథ గుహాధినాథా స్వయంప్రభా చేమాన్ రామదూతాన్విజ్ఞాయ ఫలై ర్మధుభిశ్చ సమారాధ్య నిమీలిత నయనాన్ క్షణఏవ గుహాబహిర్వింధ్యగిరిం ప్రావేశయత్. 13

అప్పుడు గుహ యజమానురాలైన స్వయంప్రభ వారిని రామదూతలనుగా నెఱింగి ఫలములతోడను, మధువులతోడను ఆరాధించి, కన్నులు మూసికొనిన యా వానరులను క్షణములో గుహ వెడలించి వింధ్యపర్వతమును ప్రవేశింపజేసెను.

ప. జానక్యలాభా త్సమయాతిపాతా
త్ప్రాయోపవిష్టాన్ ప్రజగాద కీశాన్,
సంపాతినామా సహజో జటాయో
ర్లంకాపురస్థాం రఘువీరపత్నీమ్. 14

సీత లభింపమివల్లను, గడువు మించినందువల్లను ప్రాయోప విష్టులైన ఆ వానరులకు జటాయువు సహోదరుడైన సంపాతి యను వాడు రఘువీరుని పత్ని లంకాపురమునందున్నదని చెప్పెను.

ప. హృష్టాస్సర్వే దశముఖపురీం యాతుకామాః కపీంద్రా
దృష్ట్వాఽపారం జలధి మభవన్ దక్షిణం భగ్నవేగాః,
తుష్టావాథ శ్వసనతనయం జాంబవాన్పూర్వవేదీ
తుష్టోఽసావప్యభవ దుదధే ర్లంఘనే బద్ధసంధః. 15

ఇతి కిష్కిన్ధాకాణ్డః.

హర్షించినవారై లంకాపురమున కేగగోరిన కపీంద్రులందరు అపారమైన దక్షిణ సముద్రమునుగాంచి భగ్నవేగులైరి. అంతట పూర్వ వృత్తాంత వేదియైన జాంబవంతుడు వాయునందనుని స్తుతించెను. అత డును సంతుష్టుడై సముద్ర లంఘనమున బద్ధనిశ్చయుడయ్యెను.

ఇది కిష్కింధాకాండము

## సు న్ద ర కా ణ్డః

ప. తతో మహేంద్రశిఖరా దుత్ప్లుత్య హనుమాన్ బలీ
సురసా సింహికే భిత్త్వా లఙ్కాబహి రవాతరత్. 1

సుందరకాండము

అంతట బలవంతుడైన హనుమంతుడు మహేంద్రగిరి శిఖరము నుండి పైకెగిరి, సురసను సింహికను భేదించి, లంకబయట నేలకు దిగెను.

ప. సాయం ప్రవిశ్య లంకాయాం సర్వత్ర విచికాయ సః,
కుత్రాప్యదృష్ట్వా వైదేహీం రావణాంతఃపురం యయౌ. 2

అతడు సాయంకాలమున లంకయందు ప్రవేశించి, అంతట వెదకి, ఎందును సీతను గానక రావణుని యంతఃపురమునకు బోయెను.

గ. తత్ర రత్నపర్యఙ్కే రావణేన సహ శయానాం రతిమివ త్రిభువనసుందరీం మండోదరీం నిరీక్ష్య సమీక్షితా క్షితిసుతేతి ముదితః పవనతనయః కాకుత్స్థధర్మపత్నీ నైవం భవేదితి నిశ్చిత్య పురస్తాత్పానశాలా మన్విష్యాశోకవనికాయాం పిశాచీభిరివ భయంకరాభీ రాత్రించరీభి ర్నిర్భర్త్స్యమానాం కనకసాలభంజికామివావనిదుహిత రమవేక్ష్య తన్నివాసభూతస్య శింశుపాతరోరుపరి పత్రసఞ్చయే నిలీయ శృణ్వం స్తదాలాపా నవతస్థే. 3

అందు రత్న పర్యంకమున రావణునితోగలిసి శయనించియున్న రతివలె త్రిభువనసుందరియైన మండోదరినిగాంచి, "భూసుత యగపడినది" అని సంతోషించి, పవనసుతుడు "రాఘవుని ధర్మపత్ని యిట్లెన్నడును కాబోదు" అని నిశ్చయించి, ఎదుట నున్న పానశాలను వెదకి, అశోకవనమున పిశాచులవంటి భయంకరలైన రాక్షస స్త్రీలచే బెదరింపబడుచు కనక సాలభంజికవలెనున్న భూ పుత్రినిగాంచి, ఆమెకు నివాసమైన శింశుపావృక్షముపై ఆకుల గుంపునందు దాగి, వారి మాటలను వినుచు ఉండెను.

ప. తతోఽతీతత్రియామాయాం త్రియామాయాం దశాననః,
ప్రబుద్ధ్వాగత్య వైదేహీం 'భవ భార్యే' త్యయాచత. 4

అంతట మూడు జాములు గడచిన రాత్రియందు రావణుడు మేల్కాంచి, వచ్చి, "భార్యవుకమ్ము" అని వైదేహిని ప్రార్థించెను.

ప. తృణాయ మన్యమానా సా రావణం రాక్షసేశ్వరమ్,
నినింద వివిధై ర్వాక్యైః పరుషైః కర్ణదారిభిః. 5

రాక్షసేశ్వరుడైన రావణుని తృణముగా తలంచుచున్నదై యామె కర్ణవిదారకములగు వివిధములైన పరుష వాక్యములతో నిందించెను.

ప. అథ నక్తంచరపతౌ సీతయా ధిక్కృతే గతే,
రాక్షస్యః క్రోధసంరబ్ధా జానకీం సమతర్జయన్. 6

అంతట రాక్షసరాజు సీతచే ధిక్కృతుడై వెడలిపోగా రాక్షస స్త్రీలు క్రోధసంరబ్ధలై జానకిని బెదరించిరి.

ప. అశక్నువంతీ తాం బాధాం సోఢు ముద్బంధనా దసూన్,
మోక్తుం పాదపశాఖాయాం వేణీమాసంజయంత్యభూత్. 7

ఆ బాధను సహించుటకు అశక్తురాలై యామె ఉరిపోసికొని ప్రాణములు విడుచుటకై వృక్షశాఖయందు తన వేణిని కట్టినదాయెను.

ప. తతోఽవతీర్య హనుమా నభివాద్య మహీసుతామ్,
దేవి ! మాం విద్ధి రామస్య దూత మిత్యబ్రవీ ద్వచః. 8

అంతట హనుమంతుడు దిగి, భూసుతకు నమస్కరించి, "దేవి ! నన్ను రామదూతనుగా దెలిసికొనుము" అను పలుకు పలికెను.

ప. గణయంత్యా అథాత్మానం రావణం కామరూపిణమ్,
విశ్వాసాయ దదౌ ధీమా న్రామ నామాంగుళీయకమ్. 9

అప్పుడు తనను కామరూపము దాల్చిన రావణునిగా గణించు చున్న యామెకు విశ్వాసము కలుగుటకై యా బుద్ధిమంతుడు రామ నామ ముద్రితమైన అంగుళీయకము నిచ్చెను.

ప. కథయామాస హనుమా న్కాకాసురకథామపి,
విశ్రబ్ధా చాథ ముదితా జానకీ కపిమబ్రవీత్. 10

కాకాసుర వృత్తాంతమునుకూడ హనుమంతుడు చెప్పెను. అంతట విశ్వసించి, సంతోషించిన జానకి వానరునితో నిట్లనెను.

ప. మాసే భవాన్ రఘుపతిం సహ లక్ష్మణేన
నానేష్యతే యది భవామి పరాసు రేవమ్,
సందిశ్య వల్కదళయా పిహితం మహార్ఘం
చూడామణిం కపివరస్య కరే దదౌ సా. 11

"ఒక నెలలో నీవు రఘుపతిని లక్ష్మణునితో కలిపి తీసికొని రావేని నేను ప్రాణములను విడుతును."- ఈ విధముగా సందేశమిచ్చి యామె నార చీర కొంగున ముడిచిన వెలలేని చూడామణిని వానరేంద్రుని కరమందుంచెను.

గ. అథ గమనాయ తదనుమతి మవాప్య నిజాగమన మనురావనిజానే ర్బుబోధయిషు రశోకవనికా మభాఙ్క్షీత్. విదితోదంతస్య పటపటాయిత దంతస్య దశకంథర స్యాదేశేన సమాగతా నశీతిసహస్రాణి కిఙ్కరాన్నామ రాక్షసాన్ ప్రహస్త సుతం జంబుమాలినం పంచ సేనాపతీ న్రావణాత్మజ మక్షం చ దక్షి ర్నఖై ర్వాలేన పాదపై ర్గండోపలై స్తదానీతై రాయుధైశ్చ క్షణేన నిహత్య సంవర్త సమయ సమవర్తీ వావతస్థే. 12

అంతట మరలిపోవుటకు ఆమె యనుమతిని పొంది, తన రాకను గూర్చి రాక్షసేశ్వరునకు దెలియజేయగోరినవాడై యశోకవనమును భగ్నము గావించెను. ఈ యుదంత మెఱిగి, పండ్లు పట పట కొఱికిన దశకంధరుని యాదేశమున వచ్చిన కింకరులనెడు ఎనుబదివేల రాక్షసులను, ప్రహస్తుని సుతుడైన జంబుమాలిని, ఐదుగురు సేనాపతులను, రావణుని కొడుకైన అక్షుని కోరలచేత, గోళ్ళచేత, తోకచేత, వృక్షములచేత, గండశిలలచేత, వారు తెచ్చిన ఆయుధములచేత క్షణములో సంహారించి ప్రళయకాలమందలి యమునివలె ఉండెను.

ప. అథేంద్రజేత్రా ద్రుహిణాస్త్రబద్ధో
విమోచితోఽథూచ్ఛణరజ్జుబంధైః,
తథాపి కార్యాయ నిబద్ధవత్కపి
స్సభా మగాదాశరనాయకస్య. 13

అంతట నింద్రజిత్తుచే బ్రహ్మాస్త్రబద్ధుడై, జనపమోకులకట్లచే విడువబడినవాడయ్యు ప్రయోజనము కొఱకై కట్టబడిన వానివలెనే ఉండి హనుమంతుడు రావణుని సభకు బోయెను.

ప. తత్ర రాక్షస శార్దూలై స్సేవితస్యాశరేశితుః,
సింహాసనా దుచ్చ్రతరే వాలసింహాసనే స్థితః. 14

అచ్చట రాక్షస శార్దూలములచే సేవింపబడుచున్న రావణుని సింహాసనముకంటె ఉన్నత తరమైన వాల సింహాసనమున గూర్చుండి-

ప. క స్త్వం కుతోఽసి కుత్రత్యః కిముద్దిశ్య సమాగతః,
ఇతి దైతేయపతినా పృష్టః పావని రబ్రవీత్. 15

'నీ వెవ్వడవు ? ఎటనుండి వచ్చితివి ? ఎచ్చటి వాడవు ? ఏమి యుద్దేశించివచ్చితివి ?' అని దైత్యపతిచే ప్రశ్నింపబడి పావని యిట్లు పలికెను.

గ. అస్తి కశ్చన రామోనామ దైతేయనిబర్హణే ప్రాచీనబర్హిష స్సహాయస్య దశరథస్య జఠరాన్నిఖిల నిశాచరభక్షణాయ ధరణ్యామవతీర్ణ స్తాటకాటవీదవ కృపీటయోనిః సుబాహుమారీచ ప్రముఖ పలాశనజాలతూల వాతూల స్సాప రాధవిరాధవధవిధాయీ మందేతర కందర్ప దర్ప శూర్పణఖా ముఖవికారకారీ ఖరదూషణ ప్రముఖరక్షోగణకక్ష్యాశుశు క్షణి శ్శాపాంధకబంధప్రాణవిమోచనశ్చ. కించ స్మరసి కిల ధనుర్గుణ నిష్పందీకృత వింశతిభుజం వినిశ్వసద్వదన పరంపరం భవంత మపరిమేయ వీర్యార్జునః కార్తవీర్యార్జునః కారాగారేఽస్థాపయదితి. 16

రాక్షస సంహారమున ఇంద్రునకు సహాయుడైన దశరథుని గర్భమునుండి నిఖిల నిశాచర భక్షణార్థము భూమియందు అవతరించిన, వాడు, తాటకయను నరణ్యమునకు అగ్నియైనవాడు, సుబాహు మారీచాది రాక్షసుల సమూహమనెడు దూదిపింజకు వాయువైనవాడు అపరాధియైన విరాధుని వధ విధించినవాడు, తీవ్రమైన మదనావేశము గల శూర్పణఖ ముఖమును వికృతమొనర్చినవాడు, ఖరదూషణాది రాక్షసుల సమూహమనెడి యడవికి అగ్నియైనవాడు, శాపాంధుడైన కబంధుని ప్రాణములు తీసినవాడు, రాముడు అను పేరుగల వాడొకడు కలడు. మరియు స్మరింతువుకదా వింటినారి మ్రోతచేతనే నీ యిరువది చేతులను కదలకుండచేసి, నిట్టూర్పులు నిగిడించుచున్న ముఖముల వరుసగల నిన్ను అపరిమిత బలశాలియైన కార్తవీర్యార్జునుడు కారాగారము నందుంచెను అని.

గ. తమపి విజితవతః పరశుధారయా క్షితి మక్షత్రియా మేకవింశతికృత్వః కృతవతో జామదగ్న్యస్య గర్వదహన నిర్వాపయితాఽయమ్. అపిచ, వ్యస్మార్షీః కిమఖిల

లోకాభినందనీయ బహుబలశాలీ వాలీ స్వజిఘృక్షు రయోపేత్య పృష్ఠత స్సమాశ్లిష్టవంతం భవంత మజానాన ఇవ వాలధినా తవ శిరఃకరపాదం నిశ్చలం నిర్బధ్య నిత్యకృత్యానుష్ఠానవశా చ్చతురర్ణవామ్భసి నిమజ్జయ్య సమాగచ్ఛ న్కిష్కింధాం కిమయం మహారాజస్య వాలధౌ జలనిధినిమజ్జన సమయసంలగ్నో జలూకావిశేష ఇతి సవినయం విజ్ఞాపయద్భి ర్వానరవరైః ప్రతి బోధితో ఘుణభావం ధృతవానితి. 17

అతనిని గూడ జయించినట్టియు, పరశుధారచే పృథివిని ఇరువది యొక్క పర్యాయములు అక్షత్రియను గావించినట్టియు పరశురాముని గర్వమనెడు అగ్నిని చల్లార్చిన వాడీతడు. మరియు, మఱచితివా ఏమి, అఖిలోకాభినందనీయ భుజబలశాలియైన వాలి తన్ను జయించ కోరి వచ్చి వెనుకనుండి పట్టుకొనిన నిన్ను ఎఱుగని వాడువలె తోకతో నీ తల చేతులు కాళ్ళు కదలకుండ బంధించి, నిత్యకృత్యముల ననుష్ఠించు సందర్భమున నాల్గు సముద్రముల నీట ముంచి, కిష్కింధకు తిరిగివచ్చి ఏమిది, మహారాజు వాలమున సముద్రనిమజ్జన సమయమున దగుల్కొన్న వింతజలగయా? అని సవినయముగా విన్నవించు వానర వరులచే ప్రతిబోధితుడై కీటమను భావమున విదలించెను అని.

గ. తమపి ప్రియసుహృద స్సుగ్రీవస్య ప్రియతమాప హారణకోపే నైకేనైవ బాణేన కృతాంతనిశాంతాతిథీకృత వానయమ్. ఏవంవిధ స్సపురుషోత్తమో లంకా మిమాం భస్మసా త్కర్తు మాజ్ఞామాత్రం ప్రతీక్షమాణేన సుహృదా చ సుగ్రీవేణ మదన్యై ర్వానరవరకోటిభి రుపాస్య మానేన సహ మహాంతం మాల్యవంతం సానుమన్తం సురాలయం సురాధిప ఇవాధి వసతి. పురుషాధమస్తు భవాన్పంచాననయోః పురత స్థానాతు మశక్తో జంబుక ఇవ బహిర్గతయో స్తయోర్మనుజసింహయోః

పరిగృహీత పరివ్రాజక భూమికః ప్రవిశ్యపర్ణశాలా మనఘాం
జనకనందినీ మచూచుర త్కిల. 18

అతనిని గూడ ప్రియమిత్రుడైన సుగ్రీవుని ప్రియురాలిని హరించె నన్న కోపముచే ఒకే బాణముతో యముని మందిరమునకు అతిథిని గావించినవా డీతడు. ఇట్టివాడైన ఆ పురుషోత్తముడు, ఈ లంకను వహించుటకు ఆజ్ఞకొఱకై యెదురుచూచుచు, నావంటి వానరకోటులచే సేవింపబడుచున్న మిత్రుడైన సుగ్రీవునితో గూడి గొప్పదైన మాల్యవత్పర్వతమును దేవేంద్రుడు మేరు పర్వతమునువలె అధివసించియున్నాడు పురుషాధముడవైన నీవు సింహముల యెదుట నిలువ నసమర్థమైన జంబుకమువలె ఆ మనుజసింహు లిరువురు బయటి కేగి నప్పుడు పరివ్రాజక వేషము ధరించి, పర్ణశాల ప్రవేశించి పాపరహితయైన జనకపుత్రిని అపహరించితివిగదా.

ప. తస్యా మార్గగవేషణాయ కపిషు ప్రస్థాపితే ష్వేకక
స్తీర్త్వాఽహం జలధిం ప్రవిశ్య నగరీం దృష్ట్వా విదేహాత్మజామ్,
జ్ఞాతవ్యం భవతా మమాగమనమిత్యారామభంగం వ్యథాం
వీరానప్యహనం రణే దశముఖ జ్ఞాతం కిమాద్యం తతః. 19

ఆమె జాడను వెదకుటకై పంపబడిన వానరులలో ఒకడనైన నేను సముద్రమును లంఘించి, లంకానగరమును ప్రవేశించి, వైదేహిని గాంచి, నా యాగమనము నీకు ఎఱుకపడవలెనని యారామభంగము గావించితిని, రణమున వీరులను గూడ చంపితిని. ఓయి దశముఖుడా ! మొదటిది తెలిసినదా? తరువాత-

ప. జాయా విధేయేత్యమతిర్భవాన్యా
మిచ్ఛ త్యపాపాం రఘువీరపత్నీమ్,
త్వత్ప్రాణవాతాహరణాయ జాతాం
జానీహి తాం కాలభుజంగకన్యామ్. 20

బుద్ధిహీనుడవైన నీవు భార్యగా చేసికోదగినది అని యెవ్వతెను కోరుచున్నావో ఆ నిష్కల్మషయైన రఘువీర పత్నిని నీ ప్రాణములనెడి వాయువులను హరించుటకై జన్మించిన కాలభుజంగ కన్యనుగా దెలిసికొనుము.

ప. సఖా తే సుగ్రీవో హితమవద దార్యాం జనకజాం
రఘుశ్రేష్ఠం రామం గమయ కరిణీం కుంజరమివ,
న చేదేవం రామానుజశరశతై ర్యాతునగరీ
భవే ద్విశ్వస్తానాం విలపనరవై ర్నాదిత దిశా. 21

నీ మిత్రుడైన సుగ్రీవుడు నీ కిట్లు హితము పలికినాడు- "ఆడేనుగును మగయేనుగుతో కూర్చినట్లు జనకజను రఘుశ్రేష్ఠుడైన శ్రీరాముని చేర్చుము. అట్లు గాని యెడల లక్ష్మణుని శరశతములచే రాక్షస నగరము విధవల యార్తనాదములతో మారుమ్రోగు దిక్కులు గలది యగును."

ప. ఏవం బ్రువాణస్య సమీరసూనో
ర్వధం సమాజ్ఞాపయ దాశరేంద్రః,
దూతా న వధ్యా భువనేషు వీరై
రితి న్యషేధ త్తమథో విభీషణః. 22

ఇట్లు పలుకుచున్న హనుమంతుని సంహరింపుడని రాక్షసరాజు ఆజ్ఞాపించెను. లోకములందు దూతలు వధ్యులుకారు అని విభీషణుడు అంతట వానిని నివారించెను.

ప. పటైః సంవేష్ట్యతైలేన సిక్త్వా సంయుజ్య వహ్నినా,
వాల మస్య దశగ్రీవః కారయామాస ఘోషణామ్. 23

దశగ్రీవుడు హనుమంతుని వాలమును గుడ్డలతో చుట్టి, నూనెలో తడిపి, నిప్పు ముట్టించి చాటింపు చేయించెను.

గ. విదితవృత్తాంతయా నితాంతతాంతయా ధరాసుతయా 'యద్యహం పతివ్రతా శీతోభవ హనూమత' ఇతి శాపితం నిజలూమలోమాప్యదహంతం శిఖావంత మవేత్య శాఖామృగవరిష్ఠః ప్రహృష్టమనా విచ్ఛిద్య బంధాన్నిష్పిష్య ఘోషయతో నిశాచరాన్ భస్మీకృత్య కృష్ణవర్త్మనా తేనైవ లంకాం ప్రణమ్య జానకీం నిస్తీర్య జలధి మానందయామాస సీతోదన్త కథనేన జాంబవదాదీన్ వాహినీపతీన్. 24

ఈ వృత్తాంతము తెలిసి మిక్కిలి చింతనొందిన జానకి "నేను పతివ్రతనైనచో హనుమంతునకు చల్లని వాడవు అగుదువుగాక" అని శపింపగా తన తోక వెండ్రుకనుగూడ దహింపని యగ్నినిగాంచి వానరశ్రేష్ఠుడు ప్రహృష్ట చిత్తుడై బంధములు ఛేదించుకొని, చాటింపు చేయుచున్న నిశాచరులను నుగ్గుచేసి ఆ యగ్నిచే లంకను భస్మముచేసి, సీతకు ప్రణమిల్లి, సముద్రముదాటి, సీతా వృత్తాంత కథనముచే జాంబవంతుడు మొదలుగా గల సేనాపతులను సంతోష పెట్టెను.

ప. తత ఉచ్ఛ్రితలాంగూలాః ప్లవగేశాః ప్రతస్థిరే,
ప్రవృత్తిమేతాం సీతాయా రామాయాశు వివక్షుతః. 25

తరువాత వానరేంద్రులు ఈ సీతావృత్తాంతమును వెంటనే శ్రీరామునకు చెప్పగోరినవారై తోక లెత్తుకొని బయలుదేరిరి.

ప. పథి స్థితం మధువనం సుగ్రీవస్య వలీముఖాః,
ప్రవిశ్య మారుత్యాదేశా త్పపుర్మధు పిపాసితాః. 26

వానరులు మార్గమందున్న సుగ్రీవుని మధువనమును ప్రవేశించి దప్పిక గొన్నవారై ఆంజనేయుని యాదేశమున మధువుగ్రోలిరి.

గ. అమీచ తత్రాత్మనో నివారయంతం వనపాలకం దధిముఖం భ్రూదంతజిహ్వాది నిజావయవదర్శనాదినా పరిహాసేన

దంతై ర్దంశనేన నఖై ర్విదారణేన పాణిభ్యాం చపేటా ప్రదానేన పాదై రాఘాతేన దండై స్తాడనేన వృక్షైః ప్రహారేణ గండోపలైః పిండీకరణేన చ తం కాందిశీకం విధాయ సత్వరం ప్రధావ్య సలక్ష్మణ సుగ్రీవం రాఘవ మహామహిమకయా ప్రణేముః. 27

అచ్చట వారు తమ్ము అడ్డగించిన వనపాలకుడైన దధిముఖుని భ్రూదంత జిహ్వాదులైన తమ యవయవములను ప్రదర్శించి పరిహసించుటచేత, కోరలతో కొరుకుటచేతను, గోళ్ళతో చీరుటచేతను, చేతులతో చెంప పెట్టు వేయుటచేతను, కాళ్ళతో తన్నుటచేతను, కఱ్ఱలతో కొట్టుటచేతను, వృక్షములతో మోదుటచేతను, గండశిలలతో పిండి చేయుటచేతను వానిని కాందిశీకుని గావించి, శీఘ్రముగా బరువెత్తి లక్ష్మణ సుగ్రీవ సహితుడైన రామునకు నేను నేనని ప్రణమిల్లిరి.

ప. సీతాప్రవృత్తిం విజ్ఞాప్య రాఘవాయాంజనాత్మజః,
సర్వస్వదానసదృశం రామాలింగనమన్వభూత్. 28

ఇతి సుందరకాణ్డః.

రాఘవునకు సీతా వృత్తాంతము విన్నవించి హనుమంతుడు సర్వస్వదానముంబోలిన రామాలింగన సుఖము ననుభవించెను.

ఇది సుందరకాండము.

## యు ద్ధ కా ణ్డః

ప. అథ నిశాచరనాథపురస్థితాం
జనకజా మవకర్ణ్య రఘూద్వహః,
సమవలోకత తూణయుగం ధనుః
ప్రళయ పావకదాహికయా దృశా. 1

## యుద్ధకాండము

అంనట జనక పుత్రిని రాక్షసేశ్వర నగరమందున్న దానినిగా విని రాఘవుడు ప్రళయాగ్నిని దహించు చూపుతో ధనువును, తూణ యుగమును తిలకించెను.

గ. అథ సుగ్రీవనిదేశ ప్రచలిత మాంజనేయ తారేయ సమారూఢ రామలక్ష్మణ సరీక్షణ ద్విగుణిత రణోత్సాహం ప్లవంగ మర్క్ష గోలాంగూలబల ముత్ ప్లవనేనైవ విలంఘిత నగ నదీ విపినం సముదధివేలానిల మనోహారే మహేన్ద్రశిఖర కాంతారే ఫలమధూపహారేణాధ్వశ్రమ మపానయత్. 2

అనంతరము సుగ్రీవుని యాజ్ఞచే గదలి, ఆంజనేయాంగదుల నారోహించిన రామలక్ష్మణులనుగాంచి ఉత్సాహము రెట్టించిన కోతు లయు, ఎలుగులయు, కొండముచ్చులయు బలగము గంతువేయుట చేతనే పర్వత నదీ కాంతారములనుదాటి సముద్రతీర వాయువులచే మనోహరమైన మహేంద్ర పర్వత శిఖరమందలి కాంతారమున ఫలములను, మధువును ఆరగించి మార్గాయాసమును దీర్చికొనెను.

గ. తదను దశముఖ శ్చారముఖా దజేయ మాగతం ప్లవంగమబల మాకర్ణ్య కింకర్తవ్యతామూఢః ప్రహస్త ముఖమంత్రిసంధుక్షితా యోధనోత్సాహో హితైషిణం రాఘ వాయ సీతాసమర్పణ ముపదిశంత మనుజం విభీషణం సదసి ధిక్కృత్య నిస్సారయాం బభూవ. 3

అటుపిమ్మట రావణుడు చారులవలన వచ్చిన వానర సైన్యము జయింప శక్యముగానిదని విని, ఏమి చేయుటకును తోచక, ప్రహ స్తుడు మున్నగు మంత్రులచే వృద్ధిచేయబడిన రణోత్సాహము గల

వాడై, రాఘవునకు సీతను సమర్పింపుమని మేలుకోరి యుపదేశించిన తమ్ముని విభీషణుని సభలో తిరస్కరించి వెడలగొట్టించెను.

ప. తత స్సమాగత్య పదోః పతంతం
విభీషణం ప్రాగభిషిచ్య రాజ్యే,
ఉపేక్షమాణం జలధిం నిజార్థనాం
ధనంజయా స్త్రేణ దదాహ రాఘవః. 4

తరువాత వచ్చి పాదములబడిన విభీషణుని వెంటనే రాక్షస రాజ్యమందభిషేకించి, రాముడు తన కోరికను అలక్ష్యము చేయుచున్న సముద్రుని ఆగ్నేయాస్త్రముచే దహించెను.

ప. పాదయోః పతితేనాథ సింధునా దర్శితే స్థలే,
కపివీరాహృతై శ్శైలై ర్నలం సేతు మచీకరత్. 5

అంత పాదములపై బడిన సముద్రుడు స్థలమును జూపగా వానరవీరులు తెచ్చిన కొండలతో నలునిచే సేతువు కట్టించెను.

గ. అథ విలంఘితసాగరస్య ప్రవిష్ట సువేలాచలస్య వలీముఖబలస్య పరిమాణ మవగంతు మాగతాభ్యాం కపివర సందానిత ప్రహృత మూర్ఛితాభ్యాం దయాశరధినా దాశ రథినా విమోచితాభ్యాం శుకసారణాభ్యాం విదిత నిఖిల వృత్తాన్తో దశాననో విద్యుజ్జిహ్వాముపహ్వారే కిమప్యకథయత్. 6

అంతట సముద్రము దాటి సువేలా చలము ప్రవేశించిన వానర సేన యొక్క పరిమాణమును తెలిసికొనుటకువచ్చి, కపివీరుల ప్రహా రణములచే మూర్ఛిల్లి, దయా సముద్రుడైన రామభద్రునిచే విడిపింప బడిన శుకసారణులవలన నిఖిల వృత్తాంతము తెలిసికొని దశాననుడు విద్యుజ్జిహ్వునకు ఏకాంతమున నేదో చెప్పెను.

ప. మాయావినా తేన పురో వినిర్మితం
నిరీక్ష్య భర్తు స్సశిరశ్శరాసనమ్,
ముమూర్ఛ సీతా సరమా విభీషణ
ప్రియా సమాశ్వాసయ దాప్తభాషణైః. 7

మాయావియైన ఆతనిచే నిర్మింపబడిన భర్తయొక్క శిరస్సుతోడి శరాసనమునుగాంచి సీత మూర్ఛిల్లెను. విభీషణుని భార్యయైన సరమ ప్రియభాషణములతో ఆమెను ఓదార్చెను.

ప. రామాయ సీతాం దిశ రావణేతి
హితం తతోబోధయతిస్మ మాల్యవాన్,
రక్షోధిప స్తం పరిహాస్య సేనాం
రణాయ సన్నాహవతీం చకార. 8

'ఓ రావణా! సీతను రాముని కర్పింపుము' అని మాల్యవంతుడంతట హితము బోధించెను. రాక్షసరాజు ఆతనిని పరిహసించి సేనను రణమునకు సన్నద్ధము గావించెను.

ప. పశ్చాద్వానరవాహినీ ప్రమథితాం రక్షోధిపాక్షౌహిణీ
మాలోక్యేంద్రజిదాశుగాన్ ప్రవికిరన్నప్యంగదేనాహతః,
లీనో వ్యోమని మాయయా నృపసుతౌ బద్ధ్వోరగాస్త్రైః పురీం
గత్వా తాతమలోకయ జ్జనకజాం దుఃఖార్ణవేఽమజ్జయత్. 9

అటు తరువాత రాక్షస రాజసైన్యము వానరసేనచే మథితమగుచుండుటగాంచి ఇంద్రజిత్తు బాణములను వెదజల్లుచున్నవాడయ్యు అంగదునిచే గొట్టబడెను. మాయచే ఆకాశమున దాగి ఉరగాస్త్రములచే రామలక్ష్మణులను బంధించి, పురములోనికేగి తండ్రిని దర్శించెను. జానకిని దుఃఖసముద్రమున ముంచెను.

గ. అథ యదృచ్ఛాసమాగత వినతాసుత గరుద్వాత నిర్ధూత వాతాశనాస్త్రౌ రాజపుత్రా వవలోక్యాహవోత్సాహవత్సు క్రవ్యాత్సు హనూమదంగద ప్రభృతిభి ర్నిహతాన్ ప్రహస్త ప్రభృతీన్ వాహినీపతీ నవకర్ణ్య రథాధిరూఢో జగద్భయంకరేణాకారేణ సాకమనీకాయ సమాటీకత రావణః. 10

అంతట యదృచ్ఛగా వచ్చిన గరుత్మంతుని ఱెక్కలగాలిచే తొలగింపబడిన నాగాస్త్రములుగల రామలక్ష్మణులనుగాంచి రాక్షసులు యుద్ధోత్సాహులు కాగా, హనుమంతుడు అంగదుడు మున్నగువారిచే ప్రహస్త ప్రముఖులైన సేనాపతులు సంహరింపబడిరని విని రావణుడు రథమెక్కి లోకభయంకరమైన యాకారముతో యుద్ధమునకు బయలు దేరెను.

ప. సాలాన్ గిరీంశ్చ నుదతీం కపివీరసేనా
ముత్సార్య బాణనివహై ర్భువి లక్ష్మణం సః,
శక్త్యా నిపాత్య రఘునాయక సాయకౌఘైః
ప్రాణావశేషితతను ర్నగరీం దధావ. 11

తనపై వృక్షములను. పర్వతములను విసరుచున్న వానరసేనను బాణసమూహములచే తొలగద్రోచి రావణుడు శక్తిచే లక్ష్మణుని నేల బడవైచి, రామబాణ సమూహముచే ప్రాణమాత్రావశిష్టుడై నగరమునకు బారిపోయెను.

ప. కుంభకర్ణ మథ జన్య భూగతం
భక్షయంత మఖిలా న్ప్లవీముఖాన్,
భూసుతాపతి రసూదయ త్తతః
పుష్పవృష్టి మకరో త్సురవ్రజః. 12

యుద్ధభూమికివచ్చి సర్వవానరులను భక్షించుచున్న కుంభకర్ణుని శ్రీరాముడు సంహరించెను. అంతట దేవసమూహము పుష్పవర్షము కురిసెను.

ప. సురాంతక నరాంతక ప్రభృతి రాక్షసానీ
కినీపతిష్వనిలపాకశాసనిసుతాదిభిస్సంయుగే,
హతేషు పురుహూతజిద్ధనుమదృక్షసేనాపతీ
విహాయ సహరామలక్ష్మణ మమూర్ఛయద్వాహినీమ్. 13

సురాంతకుడు నరాంతకుడు మున్నగు రాక్షస సేనాపతులు హనుమంతుడు అంగదుడు మున్నగువారిచే యుద్ధమున నిహతులు కాగా ఇంద్రజిత్తు హనుమంతుని జాంబవంతునివిడిచి, రామలక్ష్మణ సహితముగా సర్వసేనను మూర్ఛపుచ్చెను.

ప. ఋక్షాధిప నియోగేన వేగేన పవనాత్మజః,
సంజీవినీ లతాధార మానయామాస భూధరమ్. 14

జాంబవంతుని పంపున హనుమంతుడు వేగముగాబోయి సంజీవినీ లతకు ఆధారమైన పర్వతమును గొని తెచ్చెను.

ప. సంజీవినీగిరిసమీర సముదచ్ఛ్వసద్భి
శ్శాఖామృగైః కలుషితాం నగరీం విహాయ,
యుద్ధాయ సంగతవతో మకరాక్షకుంభ
పూర్వాన్స్వ్రఘూత్తమ కపీశముఖా నిజఘ్నుః. 15

సంజీవినీ పర్వతవాయువులచే మూర్ఛదేరిన వానరులచే కల్లోల పరచబడిన లంకను విడిచి యుద్ధమునకు తలపడిన మకరాక్షుడు కుంభుడు మున్నగు వారిని రాముడు, వానరముఖ్యులు సంహరించిరి.

ప. పున ర్దశముఖాత్మజో గగనలీన పవాశుగాన్
ప్రవర్ష్య భరతాగ్రజక్రుధ మవేక్ష్య లంకాగతః,
ప్రతీచపురతోరణే హనుమతః పురః పశ్యత
శ్చకర్త జనకాత్మజాం క్రకచకేన మాయామయీమ్. 16

మరల ఇంద్రజిత్తు ఆకాశమున దాగియే బాణములు వర్షించి శ్రీరాముని క్రోధమును గనుగొని, లంకనుజేరి, నగర పశ్చిమ ద్వారమున హనుమంతుని సమక్షమున, ఆయన చూచుచుండగా మాయ సీతను అంపముతో కోసెను.

ప. తస్మిన్నిరాశే రఘునాయకాంతికం
గంత ర్యయం ప్రాప్య నికుంభిలాం మఖమ్,
ఆరబ్ధవా న్రాఘవలక్ష్మణౌ తత
స్సీతాశుచాऽతీవతరాం విషీదతుః. 17

ఆంజనేయుడు నిరాశుడై రాముని సమీపమునకు బోగా ఇంద్రజిత్తు నికుంభిలను బొంది యాగము ప్రారంభించెను. అంతట రామలక్ష్మణులు సీతాదుఃఖముచే అత్యంతము విషాదమొందిరి.

ప. విభీషణాశ్వాసిత రాఘవాజ్ఞయా
గతై ర్హనూమత్ప్రముఖై ర్వలీముఖైః,
వినాశితే కర్మణి రోషభీషణ
స్సమాగమ చ్ఛక్రజయీ రణాంగణమ్. 18

విభీషణునిచే ఓదార్చబడిన రాముని యాజ్ఞచే వెడలిన హనుమ దాదులైన వానరులచే యాగ కర్మ నాశమొనర్పబడగా రోష భీషణుడై యింద్రజిత్తు రణభూమికి వచ్చెను.

ప. తత్స్యందనోన్నతతలే పవనాత్మజస్య
స్కంధే నివిశ్య వినిపాత్య శరాననేకాన్,
సౌమిత్రిరచ్ఛినదముష్య శిర శ్శరేణ
పౌరందరేణ విబుధాః కుసుమాన్యవర్షన్. 19

ఆతని రథముకంటె ఎత్తుగనున్న హనుమంతుని మూపున గూర్చుండి యనేకములైన బాణములువైచి సౌమిత్రి ఇంద్రాస్త్రముచే ఆతని శిరము ఖండించెను. దేవతలు పుష్పములు వర్షించిరి.

ప. శక్రారౌ నిహతే సుతే దశముఖ శ్శోకాబ్ధిమగ్నశ్చిరం
ప్రేయస్యాః ప్రతిరోధమప్యగణయ న్లోకైకవీరాగ్రణీః,
విశ్వస్తా పరిదేవనారవవినిర్భిన్నాఖిలాశాంచలాం
లంకాంప్రేత్యరణాంగణం ద్విగుణితక్రోధ స్సమాగా త్తతః20

పుత్రుడైన యింద్రజిత్తు హతుడుకాగా చాలాసేపు శోక సముద్రమున మునిగి దశకంఠుడు, ప్రియురాలైన మండోదరి యడ్డగించుచున్నను లెక్కచేయక లోకైక వీరాగ్రణియైన రావణుడు విధవల యార్తనాదములచే దిక్కులు బ్రద్దలగుచున్న లంకనుగాంచి ద్విగుణిత క్రోధుడై రణాంగణమునకు వచ్చెను.

ప. కపీ న్కృపాణేన విదారయ న్నయం
బభూవ సౌమిత్రిశరై రనుచ్ఛ్వసన్,
ప్రయుజ్య శక్తిం భువనైకభీషణా
మమూర్ఛయ ల్లక్ష్మణ మింద్రజి ద్రిపుమ్. 21

కరవాలముతో వానరులను చీల్చుచు, సౌమిత్రి బాణములచే ఊపిరి సలుపని రావణుడు భువనైక భీషణమైన శక్తిని ప్రయోగించి ఇంద్రజిద్విరోధియైన లక్ష్మణుని మూర్ఛపుచ్చెను.

ప. సంజీవినీ మారుత జీవితానుజం
సమీక్ష్య రామో రఘువంశవర్ధనః,
ఆఖండల ప్రేషిత ముచ్చవాజినం
సమారురోహాథ సమాతలిం రథమ్. 22

సంజీవినీ వాయువులవలన జీవించిన తమ్మునిగాంచి రఘుకుల వర్ధనుడైన రాముడు దేవేంద్రుడు పంపిన ఉన్నతాశ్వములుగల మాతలి సహితమైన రథమును ఆరోహించెను.

గ. అథ దశరథతనయ దశవదనయో ర్వారుణవినివారిత వైశ్వానరం, వైనతేయసముత్సారిత దాందశూకం, వాతాస్త్రవినిర్ధూతజైమూతం, వైకర్తనవినివర్తిత తామిస్రం, వాసవ

నిష్కాసితదానవం, వాసుదేవ ప్రచలాయిత వామదేవ, మమ్బర
తలవినిష్ట సురముని ప్రభృతిభి రత్యాదరే ణావలోక్యమాన
ముదభూ దభూతపూర్వ మాయోధనమ్. 23

అంతట రామరావణులకు వారుణాస్త్రముచే నివారింపబడిన ఆగ్నేయాస్త్రముగలది, గారుడాస్త్రముచే తొలగింపబడిన నాగాస్త్రము గలది, వాయవ్యాస్త్రముచే చెదరగొట్టబడిన మేఘాస్త్రముగలది, సూర్యాస్త్రముచే తొలగింపబడిన తమిస్రాస్త్రము గలది, ఐంద్రాస్త్రముచే పారదోలబడిన రాక్షసాస్త్రము గలది, నారాయణాస్త్రముచే నివారింపబడిన పాశుపతాస్త్రముగలది, ఆకాశమున నున్న సుర ముని ప్రభృతులచే అత్యాదరములో అవలోకింపబడుచున్నది యైన అపూర్వమైన యుద్ధము జరిగెను.

ప. శిరస్సు లూనేష్వపి వైరిణ స్తతః
పునఃపునః కందళితేషు రాఘవః,
విధేః ప్రయుజ్యాస్త్ర మథ జ్వలచ్ఛిఖం
జఘాన తం లోకవిరోధినం రణే. 24

అంతట శత్రువుయొక్క శిరస్సులు తరుగబడియు మరల మరల మొలచుచుండగా రాఘవుడు తుదకు జ్వలించుచున్న శిఖలుగల బ్రహ్మాస్త్రమును ప్రయోగించి లోకకంటకుడైన రావణుని రణమున సంహరించెను.

ప తదా వినేదు స్సురభేరికా భృశం
జగుః కలం నాకసదాం కుశీలవాః,
అనర్తిషు శ్చారుసురాంగనా స్సురా
రఘూత్తమం కల్పసుమై రవాకిరన్. 25

అప్పుడు దేవదుందుభులు అతిశయముగా మ్రోగెను. నాకలోకమున వైతాళికులు మధురముగా గానమొనర్చిరి. అందగత్తెలైన అచ్చరలు నర్తించిరి. దేవతలు కల్పవృక్ష కుసుమములతో రాముని కప్పివైచిరి.

ప. త్రిలోకవిఖ్యాత మహాభుజే మృతే
రిపావపి భ్రాతరి రాక్షసాధిపే,
కృతాత్మనిందో విలలాప మూర్ఛితో
విభీషణో గద్గదభాషణ స్తతః. 26

తనకు వైరియయ్యు త్రిలోక విఖ్యాత మహాభుజుడును, రాక్షసేశ్వరుడునునైన సోదరుడు మృతుడుకాగా విభీషణుడు మూర్ఛిల్లి, గద్గదభాషణుడై తన్నుదాను నిందించుకొనుచు విలపించెను.

ప. మందోదరీ ప్రభృతయో రజనీచరయోషితః,
విలేపుః పతిపుత్రాదీ న్విలోక్య గతజీవితాన్. 27

మండోదరి మున్నగు రాక్షస స్త్రీలు మృతులైన పతులు పుత్రులు మున్నగువారిని గాంచి విలపించిరి.

ప. ప్రేతవర్గాయ నివాపపూర్వికాః
క్రియా వితన్వంత ముముం విభీషణం,
విధాయ లంకాధిపతిం ప్రవేశనా
త్పవిత్రితాగ్నిం జగృహే స జానకీమ్. 28

పరలోక గతులైన వారికి తిలాంజలిపూర్వకములైన క్రియలు నిర్వర్తించిన విభీషణుని లంకాధిపతిని గావించి, తాను ప్రవేశించి నందున అగ్నిని పవిత్రుని గావించిన సీతను శ్రీరాముడు పరిగ్రహించెను.

ప. సహ ప్లవంగై రధిరుహ్య పుష్పకం
విమాన ముర్వీతనయాం ప్రతి ప్రభుః,
సముద్రరోధశ్శయనాదికాః కథాః
వదన్ భరద్వాజ తపోవనం యయౌ. 29

వానరులతో గలిసి పుష్పక విమాన మధిరోహించి శ్రీరామచంద్రుడు సముద్రతీరశయనము మున్నగు వృత్తాంతములను సీతకు చెప్పుచు భరద్వాజ మహర్షి తపోవనమున కరిగెను.

ప. తదాతిథేయం ప్రతిగృహ్య నాగరైః
ప్రమోదమానై ర్భరతాగ్రగామిభిః,

వియుక్తవత్సాభినవప్రసూతికా
గవీసదృక్షాభిరపి స్వమాతృభిః. 30

ఆ భరద్వాజుని యాతిథ్యము స్వీకరించి, భరత పురస్సరులై యానందించుచున్న పౌరులచేతను, దూడలనుండి వేరుచేయబడిన తొలిచూలు గోవులవలెనున్న తమ తల్లులచేతను-

ప. వసిష్ఠ పూర్వై ర్మునిభి ర్నదీజల
ప్రపూర్ణ సౌవర్ణ ఘటీకరైరపి,
అభిప్రయాతః పటహాదినాదితం
వివేశ సాకేతపురం రఘూద్వహః. 31

నదీజల పూర్ణములైన సువర్ణకలశములు చేతులందుగల వసిష్ఠ పూర్వులైన మునులచేతను ఎదుర్కొనబడినవాడై రఘూద్వహుడు పటహాది వాద్యములు బోరున మ్రోయుచున్న సాకేతనగరము ప్రవేశించెను.

ప. తత శ్చతుస్సాగరవారిపూర్ణై
స్సువర్ణ కుంభై స్సహజాని మేనమ్,
హిరణ్యపట్టా మవబధ్య ఫాలే
వసిష్ఠ పూర్వా మునయోఽభ్యషించన్. 32

అనంతరము వసిష్ఠ పురస్సరులైన మునులు దేవీ సహితుడైన శ్రీరామచంద్రుని ఫాలమున బంగరు పట్టముగట్టి, నాల్గు సముద్రముల జలములతో నిండిన సువర్ణ కలశములతో అభిషేకించిరి.

ప. అథారుహ్య భద్రాసనం రామభద్రః
కిరీటం కులాయాత మాదాయ మూర్ధ్ని,
స సమ్మానయామాస సమ్మాననీయా
న్మునీశా న్మహీశా న్కవీశా న్కపీశాన్. 33

ఇతి యుద్ధకాణ్డః.

అంతట రామభద్రుడు భద్రాసన మధిష్ఠించి, కులక్రమాగతమైన కిరీటమును శిరమున ధరించి, సమ్మాన యోగ్యులైన మునీశ్వరులను, భూమీశ్వరులను, కవీశ్వరులను, కపీశ్వరులను సమ్మానించెను.

ఇది యుద్ధ కాండము.

## ఉ త్త ర కా ణ్డః

ప. సుగ్రీవప్రముఖాన్ సఖీన్ జనపదే స్వే స్వే ప్రతిష్ఠాపయన్
పుత్రౌ ప్రాప గుణాధికౌ కుశలవా వానంద పూర్ణాన్తరః,
నిత్యం సాదర మాశ్రిత స్స్వతనుజై ర్లోకో త్తరై ర్భ్రాతృభి
ర్మాతౄణాం ముద మావహన్ సమకరో ద్రాజ్యంహి నిష్కం-
టకమ్. 1

ఇత్యుత్తరకాణ్డః.

## ఉత్తర కాండము

సుగ్రీవాదులైన మిత్రులను వారి వారి రాజ్యమున ప్రతిష్ఠాపించి, ఆనంద పూర్ణహృదయుడై శ్రీరాముడు గుణాధికులైన కుశ లవులను నిరువురు పుత్రులను పడసెను. తన కుమారులతోడను, లోకోత్తరులైన తమ్ములతోడను గూడినవాడై నిత్యము తల్లులకు సంతోషము కలిగించుచు రాజ్యమును నిష్కంటకముగా పాలించెను.

ఇది ఉత్తరకాండము.

ప. ఇతి వైయాకరణేన శ్రీ మద్రామానుజాభిధానేన,
రచితం రామాయణసంగ్రహమనుగృహ్ణాతుజానకీ జానిః.2

రామాయణ సంగ్రహః సంపూర్ణః.

ఇట్లు శ్రీమద్రామానుజ నామధేయుడగు వైయాకరణునిచే రచింపబడిన రామాయణ సంగ్రహమును జానకీపతి యనుగ్రహించుగాక !

రామాయణ సంగ్రహము సంపూర్ణము.

## అకర్మకాది ప్రయోగాణా ముదాహరణాని ప్రదర్శ్యంతే

(అకర్మకాది ప్రయోగములకు ఉదాహరణములు చూపబడుచున్నవి).

శ్లో. రామో విరాజతే రామో భూమండల మపాలయత్
రామచంద్రో దశగ్రీవం పరలోక మనీనయత్. 1

శ్లో. రామేణోపార్జితా కీర్తిః రామచంద్రేణ భూయతే
రామేణ కుంభకర్ణస్తు ప్రాపిత స్త్రిదశాలయమ్. 2

1. రామో విరాజతే
(అకర్మక కర్తరి ప్రయోగః)

రాముడు రాజిల్లుచున్నాడు.
(అకర్మక కర్తరి ప్రయోగము)

2. రామో భూమండల మపాలయత్
(సకర్మక కర్తరి ప్రయోగః)

రాముడు భూమండలమును పాలించెను.
(సకర్మక కర్తరి ప్రయోగము)

3. రామచంద్రో దశగ్రీవం పరలోక మనీనయత్.
(ద్వికర్మక కర్తరి ప్రయోగః)

రామచంద్రుడు దశగ్రీవుని పరలోకమును చేర్చెను.

(ద్వికర్మక కర్తరి ప్రయోగము)

4. రామేణోపార్జితా కీర్తిః.

(కర్మణి ప్రయోగః)

రామునిచే కీర్తి యార్జింపబడినది.

(కర్మణి ప్రయోగము)

5. రామచంద్రేణ భూయతే.

(భావే ప్రయోగః)

రామునిచే కాబడినది.

(భావే ప్రయోగము)

6. రామేణ కుంభకర్ణస్తు ప్రాపిత స్త్రిదశాలయమ్.

(ద్వికర్మక కర్మణి ప్రయోగః)

రామునిచే కుంభకర్ణుడు త్రిదశాలయమును పొందింపబడెను.

(ద్వికర్మక కర్మణి ప్రయోగము)

ఇతి శివమ్.